# ఆంధ్ర ప్రదేశ్ లో

| | |
|---|---|
| జనాభా | 4,35,03,000 |
| షెడ్యూలు కులాలవారు | 57,75,000 |
| షెడ్యూలు జాతులవారు | 16,58,000 |
| విస్తీర్ణం (చ.కి.మీ.) | 2,76,754 |
| జిల్లాలు | 21 |
| తాలూకాలు | 195 |
| పట్టణాలు, నగరాలు | 224 |
| పల్లెలు | 27,221 |
| పంచాయతీలు | 15,920 |
| పంచాయతీ సమితులు | 324 |
| పార్లమెంటు సభ్యులు | 59 |
| శాసన సభ సభ్యులు (ఒక నామినేటెడ్ సభ్యునితో సహా) | 288 |
| శాసన పరిషత్తు సభ్యులు | 90 |
| విశ్వవిద్యాలయాలు | 5 |
| అక్షరాస్యులు | 1,06,90,000 |

# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 19 — సెప్టెంబర్, 1975 — సంచిక : 11

భాద్రపద—ఆశ్వీయుజ, 1897

ప్రధాన సంపాదకులు

శ్రీ రా జ్యం సి న్హా

సంపాదకులు

యన్. వి. గోపాలశాస్త్రి


తెలుగు పతాకం యెగురని దిశయే లేదు
తెలుగు దివ్వె వెలుగనట్టి నిశయే లేదు
తెలుగు పులుగు చేరలేని దేశం లేదు
తెలుగు వెలుగు దూరలేని కోశం లేదు

—దాశరథి

మొదటి కవరు పేజీ : నూతన కార్యక్రమావళితో నవచైతన్యం

మూడవ కవరు పేజీ : ఉరకలువేసే కెరటాల్లో ఉత్సహంతో జలక్రీడ

(ఫొటో: శ్రీధర్స్ ఫొటో సర్వీస్)

మధ్యపేజీల్లో : శ్రమజీవుల కృషిఫలితం


సాలు చందా : ఆరు రూపాయలు

వెల: 50 పైసలు

రిజిస్టరు నెం: హెచ్/హెచ్. డి. 81


## ఈ సంచికలో..

పేజీ

# తెలుగు తల్లి

'లసూనా'

"అమరజీవు" ల కోర్కె నాంధ్రావతరణమై
కందెనోలుకు తేరు కదలునాడు
ముక్కోటి జనశక్తి ముక్కచెక్కల జేర్చి
నె జాము గద్దెపై నిలుపునాడు
"తెలగాణ" మాదిరా ! తెగద్రెంచుడని పల్కి
తెలుగు బిడ్డల తలల్ తెగిననాడు
"జై యాంధ్ర" అని జనుల్ జైత్రయాత్రల సల్పు
ఆవేశ మాకాశ మంటునాడు
ఆంధ్ర మెక్కడ ? తెలగాణ మనగనేడ ?
అరయ లేరైరి, యర్భకు లమ్మయెవరో !
తెలుగు తోటన బుట్టిన తెగులు మాన్పి
దిద్దుకొనవమ్మ నీ యిల్లు తెలుగు తల్లి !

* * *

అన్నయ్య జన్మించె "నాదిలాబాదు" లో
అత్తగా రూరాయె "నమృతలూరు"
"చిత్తూరు" లో బుట్టి చిన్నక్క చదువుకై
"వైజాగు" తీరాన విడిదిచేసె
"భద్రాద్రి రామయ్య" పాదసేవలుజేయు
"పామర్రు" తాతయ్య భక్తి మీర
"గుంటూరు" బావయ్య "గోల్కొండ" పిల్లతో
"గండిపేట" షికారు కందుకొనియె !
"ఆరు సూత్రాల" పరిధుల కందరాని
అంతరంగాల సూత్రాల ననుసరించి
ఆంధ్ర తెలుగాయె: తెలుగాంధ్ర మయ్యెనేమొ !
దిద్దుకోవమ్మ బిడ్డల తెలుగు తల్లి !

* * *

గలగలా కృష్ణమ్మ గతుకు బాటల దాటి
సాగరమ్మున నిల్చి సాయపడగ
కోటి గొంతుల మీటి గోదారి మాయమ్మ
పాయపాయన పైడి పంటలొసగ
కొత్తగూడెపు "శక్తి" కొంగ్రొత్త శిఖరాల
వెలుగు తీవల సాగి వేడ్క మీర
కలమెత్తి, హలమెత్తి, కవి కర్షకులు గూడి
నీ కీర్తి, నీ శక్తి నినుమడింప
సాగిపోవమ్మ ! సకలాంధ్ర సౌరభముల
నింపుకొంచును నేలపై నింగిపైన
పాడిపంటల, సుఖశాంతి పథములందు
దివ్య జనయిత్రి మముగన్న తెల్గుధాత్రి !

* * *



# సామాన్యుడి జీవితంలో సరికొత్త మజిలీ

ముఖ్యమంత్రి

ఆగస్టు 15 సందేశం

శ్రీ జలగం వెంగళరావు

భారతీయు లందరికీ ఆగస్టు 15 వ తేదీ పవిత్రమైన దినం. ఇరవై ఎనిమిది సంవత్సరాలక్రితం, 1947 లో, ఆ తేదీన మనం స్వాతంత్ర్యం సాధించుకున్నాం. ఏటేటా మనం దీన్ని పెద్ద పండుపుగా జరుపుకుంటాం. స్వరాజ్యం కోసం ప్రాణాలు అర్పించి అమర వీరులైన వేలాది దేశ భక్తులకు జోహారులు అర్పించుకుంటాం వారి అడుగు జాడలలో మెలుగుతామనీ, వారు మనకు యిచ్చిపోయిన స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకుంటామనీ, పేద ప్రజలకు సేవ చేస్తామనీ, దేశాన్ని యింకా ముందుకు తీసుకు పోతామనీ శపథం చేస్తాం. దేశానికి అంకితమై, ఆయేటికాయేడు ఎక్కువగా కృషిచేయడానికి పూనుకుంటాం.

మన స్వాతంత్ర్యాన్ని హరించే శక్తులు కొన్ని తల ఎత్తాయి. దేశంలో కొంతమంది అరాచకం కల్పించడానికి తలపడ్డారు మన ప్రజా స్వామ్య రాజ్యాంగం ప్రకారం ఎన్నికలలో గెలిచి అధికారం చేజిక్కించుకునే బలం వారికి లేదు. ఆ సంగతి వారికీ తెలుసు, మన ప్రజలకూ తెలుసు, లోకానికీ తెలుసు. అందువల్ల ఏదో విధంగా దేశంలో గందరగోళ పరిస్థితులు కల్పించాలని నిర్ణయించుకున్నారు. ప్రభుత్వం పనిచేయకుండా అడ్డంకులు కల్పించడానికీ, ప్రజలను తప్పుడు మార్గాలు పట్టించడానికీ పెద్ద పెద్ద పథకాలు వేశారు. దేశంలో దౌర్జన్య చర్యలు పురికొల్పడానికీ, మత విద్వేషాలూ, ప్రాంతీయ విద్వేషాలూ రెచ్చగొట్టడానికి ప్రయత్నాలు ప్రారంభించారు. ఇవన్నీ కేంద్ర ప్రభుత్వానికి తెలియకపోలేదు. బీహారులో ఎన్నికైన ప్రభుత్వాన్ని గద్దె దించడానికి జరిగిన ప్రయత్నాలూ, గుజరాత్ సంఘటనలూ కేంద్రం ఒక కంట కనిపెట్టే వుంది. కాని ప్రజాస్వామ్యంలో తొందరపడి ఏచర్యా తీసుకోడానికి వీల్లేదు గదా దేనికైనా సమయం రావాలి. ప్రజల మద్దతు వుండాలి. ఆ సమయం వచ్చింది. కొందరు నాయకులు సైన్యాన్నీ, పోలీసులనూ, ఉద్యోగులనూ ప్రభుత్వానికి ఎదురు తిరుగవలసిందని రెచ్చగొట్టడం ప్రారంభించారు. ఇంకా యీ పరిస్థితి కొనసాగనిస్తే యిది శ్రుతి మించి రాగాన పడే ధోరణిలో వుంది. దేశంలో అల్లకల్లోలం ఏర్పడే ప్రమాదం కనిపించింది.

ప్రపంచంలో ఏ ప్రజాస్వామ్య దేశమైనా, యిటువంటి పరిస్థితులను చూస్తూ చేతులు ముడుచుకొని కూచోలేదు. దీన్ని అదుపులో పెట్టడం తప్పనిసరి. అందుకే రాష్ట్రపతి దేశంలో అత్యవసర పరిస్థితి ఏర్పడినట్లు ప్రకటించవలసి వచ్చింది. అల్లరి చేయదలచినవారే దీనికి పూర్తి బాధ్యత వహించాలి. ప్రజాస్వామ్యంలో ఏ మాత్రం నమ్మకంలేని నానా గోత్రాలవారు అవకాశవాదులుగా కలిసి దేశానికి ముప్పు తేవడానికి ముందుకు వచ్చినప్పుడు వారిని అదుపులో పెట్టడం ప్రభుత్వ కర్తవ్యం. ప్రజాస్వామ్యవాదులైన ప్రజలందరి కర్తవ్యం.

దేశంలో అభ్యుదయకరమైన ఏ చర్య తీసుకున్నా దానికి అడ్డు తగిలే శక్తులు వుంటూనే వున్నాయి. మన ప్రధానమంత్రి వీరి పన్నాగాలను బైటపెట్టారు.

మైనారిటీ వర్గం వారు మెజారిటీ ప్రభుత్వాన్ని గద్దె దించాలనుకుంటే దానికి రాజ్యాంగ పద్ధతులు వున్నాయి. వాటిని గంగలో త్రోసి దౌర్జన్యానికి దిగితే జరిగేది యింతే. ఇన్నాళ్ళూ వారివెంట తిరిగిన ఆ కొద్దిమంది ప్రజలుకూడా నిజం తెలుసుకొని వెనక్కు తగ్గుతారు.

## 20 సూత్రాల కార్యక్రమం

మనం మంచి చెయ్యబోతుంటే కొన్ని శక్తులు అడ్డం తగులుతున్నాయి. కాబట్టి వాటిని అదుపులో పెట్టాం. దీన్ని ప్రజలు కూడా ఆమోదించారు. ఇంతటితో మనపని పూర్తికాలేదు. ఆ చేయదలచుకున్న మంచి ఏమిటో మనం బైటపెట్టాలి. ఆ మంచి పనులు చేయడానికి యిది మనకు సదవకాశం. అందుకే మన ప్రధానమంత్రి 20-సూత్రాల కార్యక్రమం ప్రకటించారు. దీనిని సాధ్యమైనంత తక్కువ కాలంలో అమలుపరచడానికి దేశమంతటా కృషి ప్రారంభమైంది. ప్రధానమంత్రి చెప్పినట్లు యిదంతా "మ్యాజిక్" వల్ల అయ్యేపని కాదు. ప్రజలందరూ క్రమశిక్షణతో కష్టపడి చేసుకుంటే అయ్యేపని. అన్ని వర్గాల ప్రజల్లోనూ, యిటీవల క్రమశిక్షణ బాగా దెబ్బతిన్నదన్న విషయం అందరికీ తెలిసిందే. విచ్చలవిడిగా ప్రవర్తించడం ఎక్కువైంది. ప్రజాస్వామ్యం వల్ల వచ్చిన హక్కులను దుర్విని

యోగంచేసి ఎవరికి వారు స్వార్థంతో ఆలోచించే ధోరణి బలిసింది. బ్లాక్‌మార్కెట్లు, దొంగ రవాణాలు, పన్ను ఎగవేతలు, మొదలైన సాంఘిక, ఆర్థిక నేరాలు ఎక్కువవుతున్నాయి. వీటన్నిటినీ అదుపులో పెట్టందే మనం చేసే ఏ పనీ విజయవంతం కాదు. దేశంలో కోట్లాది దరిద్ర నారాయణులున్నారు. తినడానికి తిండీ, ఉండడానికి యిల్లూ, కట్టుకోను బట్టా లేక నిత్య దారిద్ర్యంతో జీవితం గడుపుతున్నారు. సంఘంలోని రకరకాల స్వార్థపరులు వీరిని నిత్యం పీడిస్తున్నారు. అలాగే ధరల పెరుగుదలవల్లా, ఇండ్ల కొరతవల్లా పట్టణాల్లోని కార్మికవర్గం, మధ్య తరగతి ప్రజలూ బాధపడుతున్నారు. ఈ అన్నివర్గాల ప్రజలనూ దృష్టిలో వుంచుకుని, వారి అవసరాలను మనస్సులో పెట్టుకుని ప్రధానమంత్రి 20-సూత్రాల ప్రణాళికను తయారు చేయడం జరిగింది.

## తాలూకా కేంద్రాల్లో సూపర్ బజార్లు

ఉత్పత్తిని అన్ని రంగాలలో పెంచడం, నిత్య జీవితానికి అవసరమైన వస్తువులను ప్రజలందరికీ అందేటట్లుగా పంపిణీ పద్ధతులను బాగుచేసుకోవడం అతి ముఖ్యమైన విషయాలు. దేశంలోని ఉత్పత్తిదార్లు, కార్మిక సంఘాలు ప్రధానమంత్రి కార్యక్రమాన్ని అమలు పరచడంలో సహకరిస్తామని హామీ యిచ్చారు. ఇది శుభసూచన. మన రాష్ట్రంలో దొంగ వ్యాపారాన్ని అరికట్టడానికీ, బ్లాక్ మార్కెట్ లేకుండా చేయడానికీ పట్టుదలతో కృషి జరుగుతున్నది. భూస్వాములవద్ద వుండే ధాన్యపు నిల్వలను జులై నెలాఖరులోగా బైట పెట్టాలని ప్రభుత్వం ఉత్తరువు చేసిన ఫలితంగా కొంత మేలు జరిగింది. బీద వర్గాల ప్రజలకు చవుక ధరలో తిండిగింజలు అందించడానికై, తాలూకా కేంద్రాలలో సూపర్ బజార్లు తెరవాలని నిర్ణయించాం. వాటి ద్వారానే ప్రజలకు అవసరమైన యితర వస్తువులు కూడా అందుతాయి. మన రాష్ట్రంలో అదనంగా 7 లక్షల హెక్టార్ల విస్తీర్ణంలో సేద్యపు నీటివసతులు కల్పించడానికి కృషి జరుగుతుంది. ఇప్పటివరకు పూర్తికాకుండా వున్న నీటి పారుదల పథకాలు త్వరలో పూర్తి చేయడానికి అవసరమైన చర్యలు తీసుకుంటున్నారు. ప్రధాని తమ ప్రకటనలో అదనంగా 50 లక్షల హెక్టార్లకు నీటి సాగు సౌకర్యం కల్పిస్తామని ప్రజలకు వాగ్దానం చేశారు. మనది ప్రధానంగా వ్యవసాయరాష్ట్రం కాబట్టి యిందులో మనం ఎక్కువగా బాధ్యత తీసుకుని పనిచేయవలసి వుంటుంది. అలాగే భూసంస్కరణల కార్యక్రమాన్ని త్వరితంగా పూర్తిచేసుకుని వీలైనంత ఎక్కువ మందికి భూమి యివ్వవలసి వుంది. అయితే నిరుపేదలైన వారికి భూవసతి కల్పించగానే సరిపోదు. వారికి వ్యవసాయం చేసుకోడానికి అవసరమైన పరపతి సౌకర్యం కూడా కల్పించాలి-దేశమంతటిలో గ్రామీణ బ్యాంకులు ఏర్పాటు చేయడానికి కేంద్ర.ప్రభుత్వం చర్యలు తీసుకుంటున్నది. మన రాష్ట్రంలో కూడా యీ విషయంలో సహకార శాఖ వారు కొన్ని నిర్ణయాలు తీసుకున్నారు. పరపతి సంఘాలు మొదలైన సంస్థలద్వారా వ్యవసాయ పనులకోసం యిచ్చే ఋణాల్లో 50 వరకు మాత్రమే బలహీన వర్గాలవారికి యిచ్చే అవకాశం లోగడ వుండేది. ఇక ముందు 75 శాతం వరకు ఋణాలు బలహీన వర్గాల వారికి అందుబాటులో వుంటాయి. బలహీన వర్గాలవారి నందరినీ సహకార సంఘాల సభ్యులుగా ఆకర్షించి వారిని వడ్డీ వ్యాపారస్తుల బారినుండి తప్పించడానికి కృషి చేయాలని నిర్ణయించారు. ఇందుకోసం ఏర్పడిన సంఘాల ఆర్థిక స్తోమతు పెంచడానికి బడ్జెట్ కేటాయింపును కోటి రూపాయల వరకు పెంచడానికి కూడా అవకాశం వుంది. విద్యాసంస్థలలోనూ, పారిశ్రామిక సంస్థలలోనూ వినియోగదార్ల స్టోర్లు తెరుస్తారు. వాటిద్వారా సరసమైన ధరలకు వస్తువులు సరఫరా జరుగుతాయి. పట్టణాల్లో కార్మికులు నివసించే ప్రాంతాల్లో సూపర్ బజారు బ్రాంచీలు ఏర్పాటుచేస్తారు. ఇండ్ల స్థలాల పంపిణీ, పేదవర్గాలవారి కోసం గృహనిర్మాణం మొదలైన పథకాలు ముమ్మరంగా కొనసాగించడానికి నిర్ణయాలు జరిగాయి.

## ఇది ప్రజలందరి పని

ఈ విధంగా, దేశంలో యిప్పుడున్న ప్రశాంత వాతావరణాన్ని అవకాశంగా తీసుకుని, ప్రజల జీవన పరిస్థితులను మెరుగుపరచడానికి ప్రతిజ్ఞ చేయడమే యీయేడు ఆగస్టు 15 వ తేదీన మనం చేయవలసిన పని ఎన్నాళ్లనుండో మనం కలలు కంటున్న అనేక కార్యక్రమాలు ఆచరణలో ఫలించే అవకాశం యిప్పుడు వచ్చింది. దీనిని జారవిడుచుకోవడం అవివేకం అవుతుంది. ప్రధానమంత్రి తాము ప్రకటించిన కార్యక్రమాన్ని దేశమంతటా అమలు పరచడానికి పట్టుదలతో కృషి ప్రారంభించారు. దేశంలో ప్రజలందరూ ఆమె వెంట నడవడానికీ, ఆమె చెప్పినట్లు చేయడానికీ సిద్ధంగా వున్నారు. ఏనాడూ, ఏ ఒక్క విషయంలోనూ, యితర ప్రాంతాలకు తీసిపోని మన రాష్ట్రంలో కూడా ప్రజలందరూ యీ ఉద్యమంలో పాల్గొనడానికి ముందుకు రావాలని విజ్ఞప్తి చేస్తున్నాను ఇది ప్రధానమంత్రి ఒక్కరూ చేయగల పనికాదు. ప్రభుత్వాలు చేయగల పనికాదు ఇది ప్రజలందరి పని అందరూ క్రమశిక్షణతో కలిసి చేసుకోవలసిన పని సామాన్యుడి జీవితంలో కొత్త కవాటాలు తెరిచే యీ ఆర్థిక కార్యక్రమం త్వరితంగా అమలు పరచుకునే కృషిలో అందరూ ముందుకు రండి అని ఆహ్వానిస్తున్నాను. ఈయేడు ఆగస్టు 15 శుభ సమయంలో యిదే నా సందేశం. ఇదే ప్రజలందరి సందేశం.

దేశపునర్నిర్మాణమనే మహాయజ్ఞానికి యీనాడు కావలసిన వెన్నో వున్నాయి. పని అనేది కావాలి. కార్మిక శక్తి కావాలి. ప్రశాంత పరిస్థితి నెలకొనడం కావాలి. సహకార కృషి కావాలి. దేశంలో విస్తరించివున్న వివిధ ప్రయోజనాత్మక ప్రగతి శక్తులన్నీ సమీకృతం కావాలి.

జవహర్‌లాల్ నెహ్రూ

# నవ చైతన్యం

## అత్యవసర వస్తువుల ధరల తగ్గుదలకు, ఉత్పత్తి, సేకరణ, పంపిణీలను క్రమబద్ధం చేయడానికి, ప్రభుత్వ ఖర్చులో పొదుపు పాటింపుకు చర్యలు

1966 సం॥ ఆంధ్రప్రదేశ్ వస్తువుల ధరల పట్టికల ప్రదర్శన ఉత్తర్వును పటిష్ఠంగా అమలు జరపాలని జిల్లా కలక్టర్లకు నిర్దిష్టమైన ఆదేశాలు జారీ చేశారు. ఇందువల్ల అత్యవసర వస్తువుల ధరలు, నిల్వల ప్రకటన పట్టికలను ప్రదర్శించే బాధ్యత డీలర్లపై ఉంటుంది. 9 లక్షల టన్నుల బియ్యం సేకరించాలని లక్ష్యంగా ఉండగా యింతవరకు 8.2 లక్షల బియ్యం సేకరించారు. పెద్ద భూస్వాములు నిల్వలను దాచడం వలన మార్కెట్లలోకి ధాన్యం తక్కువగా రావడాన్ని నిరుత్సాహ పరచడానికి వీలుగా, 10 ఎకరాలు అంతకుపై బడిన భూమిలో వరిసాగు చేసేవారు 100 క్వింటాళ్ళ పై బడి వరి ధాన్యం లేదా దానికి సమానమైన బియ్యం గలవారు తమ నిల్వలను ప్రతినెలా ప్రకటించాలని ప్రభుత్వం నోటిఫికేషను జారీ చేసింది. రైతులు తమవద్దగల నిల్వలను తెల్పే మొదటి ప్రకటన ఆగస్టు 5 లోగ అందజేయాలి. చౌక దుకాణాల ద్వారా సరఫరాచేసే బియ్యం ధరలను క్వింటాలుకు రూ. 2 ల చొప్పున ప్రభుత్వం తగ్గించింది. అంతర్రాష్ట్ర సరిహద్దులద్వారా బియ్యం అక్రమరవాణాను అరికట్టడానికి తీసుకునే చర్యలను తీవ్రతరం చేశారు. ప్రభుత్వం తీసుకున్న వివిధ చర్యల ఫలితంగా ఆహారధాన్యాలు, పప్పులు, చక్కెరధరలు తగ్గుముఖం పట్టాయి. ముతక బియ్యం ధరలు క్వింటాలుకు రూ. 10 ల చొప్పున తగ్గాయి. కొన్ని జిల్లాలలో యీతగ్గుదల యింకా ఎక్కువగానే ఉంది.

ప్రణాళికేతర రంగంలో ప్రభుత్వ ఖర్చులో పొదుపు పాటించడానికి రాష్ట్ర ప్రభుత్వం కొన్ని చర్యలను ప్రవేశ పెట్టింది. ఇప్పుడు సంవత్సర కాలంగా ప్రభుత్వం ఓవర్ డ్రాఫ్టు తీసుకోలేదు.

### భూ సంస్కరణలు

1975 జనవరి 1 వ తేదీనుండి అమలులోకివచ్చిన 1973 వ సం॥ ఆంధ్రప్రదేశ భూ సంస్కరణలు (వ్యవసాయ కమతాల పరిమితి) చట్టాన్ని అనుసరించి ఇంతవరకు దాదాపు 4.2 లక్షల డిక్లరేషనులు దాఖలు అయ్యాయి. డిక్లరేషనులు దాఖలు చేయని వారికి దాదాపు 50,000 నోటీసులకు పైగా జారీ చేశారు. ఈ పని నిర్వహణకు 300 కు పైగా డిప్యూటీ తహసీల్దార్లను, 60 కి పైగా ట్రిబ్యునల్స్‌ను నియమించారు. ఈ చట్టం అమలు యిప్పుడు ముమ్మరంగా కొనసాగుతున్నది.

### బలహీన వర్గాలవారికి ఇండ్ల స్థలాలు

రాష్ట్రంలో హరిజనులకు యిండ్ల స్థలాలు కేటాయించే కార్యక్రమం అమలులో ఉంది. ప్రభుత్వభూములు ఉన్నచోట వాటిని యిండ్ల నిర్మాణానికి వెనుకబడిన వర్గాలవారికి కేటాయిస్తున్నారు. ప్రభుత్వభూమిలేని ప్రదేశాలలో భూమి సేకరణ చట్టం క్రింద, ప్రైవేటు ఒప్పందాల క్రింద ప్రైవేటు భూములను సేకరిస్తున్నారు. ప్రస్తుత సంవత్సరం యిందు కొరకు రు 2 5 కోట్లు కేటాయించారు. గత సంవత్సరం రు. 1 5 కోట్లు మాత్రమే కేటాయించారు. ఈ సంవత్సరం అదనంగా మరొక లక్ష కుటుంబాలకు యీ సౌకర్యం కలిగించడానికి వీలుగా మరొకరు. 2 5 కోట్లు కేటాయించాలని కేంద్ర ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. ఈ కార్యక్రమం విస్తరణకు మరికొన్ని యితర చర్యలు పరిశీలనలో ఉన్నాయి.

గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయ కూలీలు, వృత్తి పనివారు ప్రైవేటు భూములలో యిండ్లు నిర్మించుకుని, తమ స్వాధీనంలో ఉంచుకొన్న పక్షంలో ఆ యిండ్ల హక్కును వారికి సంక్రమింపజేసే బిల్లును శాసనసభలో అప్పుడే ప్రవేశపెట్టారు. ఇప్పుడది ఉభయ సభల సంయుక్తసంఘం పరిశీలనలో వుంది.

### వెట్టిచాకిరీ నిషేధం

రాష్ట్రంలో వెట్టిచాకిరి అమలులేదు కొన్ని రకాల వెట్టిచాకిరి అమలులో ఉన్నట్లు గుర్తించబడిన ఆంధ్రజిల్లాలలోని ఏజన్సీ ప్రాంతాలకు సంబంధించిన ఒక శాసనం యిప్పుడు అమలులోఉంది. అయితే రాష్ట్ర ప్రభుత్వం పరిస్థితిని సమీక్షించి, రాష్ట్రంలో ఎక్కడ ఏ రూపంలో వెట్టిచాకిరి అమలులో వున్నా దానిని నిషేధిస్తూ సమగ్రమైన శాసనంచేసే విషయాన్ని పరిశీలిస్తున్నది.

### గ్రామీణ రుణ భార విముక్తి

రాష్ట్రంలోని ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో వ్యవసాయ రుణవిముక్తికి యిదివరకే శాసనాలు అమలులో వున్నాయి. రుణ విముక్తికి మరికొన్ని చర్యల గురించి తీవ్రంగా పరిశీలిస్తున్నారు. వెనుకబడిన వర్గాల ప్రయోజనం నిమిత్తం ప్రైవేటు పరపతి స్థానంలో సంస్థాగత పరపతిని ప్రవేశపెట్టే ప్రతిపాదనకు రాష్ట్ర ప్రభుత్వం హర్షిస్తున్నది. ఈ లోపున సన్నకారు, మధ్యతరగతి రైతుల పరపతి సౌకర్యాల పెంపుదలకూ, వారి ఆర్థిక అభివృద్ధికి కార్యక్రమం రూపొందించడానికీ సన్నకారు రైతుల అభివృద్ధికి ఒకటి, లాభసాటిలేని రైతులు, వ్యవసాయ కార్మికులకు ఒకటి. మొత్తం రెండు పథకాలను కేంద్ర ప్రభుత్వం ప్రవేశపెట్టింది. నాలుగవ ప్రణాళికకాలంలో రాష్ట్రంలో శ్రీకాకుళం, కడప, నల్లగొండ జిల్లాలలో మూడు సన్నకారు రైతుల అభివృద్ధి ఏజన్సీలను విశాఖ

పట్నం, నల్లగొండ జిల్లాలలో రెండు లాభసాటిలేని రైతులు, వ్యవసాయ కార్మికుల అభివృద్ధి ఏజన్సీలను ప్రారంభించారు. ఈ ఏజన్సీలకు 1975 మార్చి 31 నాటికి కేంద్ర ప్రభుత్వం మొత్తం రు. 265.96 లక్షల గ్రాంట్లు విడుదల చేసింది. రాష్ట్ర ప్రభుత్వం రు. 50 లక్షలు విడుదల చేసింది. 1975 మే ఆఖరు నాటికి మొత్తం రు. 294.35 లక్షలు ఖర్చు చేశారు. ఐదవ ప్రణాళిక కాలంలో రాష్ట్రంలో దిగువ పేర్కొన్న జిల్లాలలో ఏర్పాటు చేయడానికి కేంద్ర ప్రభుత్వం 12 కొత్త పథకాలను కేటాయించింది:

1. తూర్పుగోదావరి, 2. కృష్ణా, 3. గుంటూరు, 4. నెల్లూరు, 5. ప్రకాశం, 6. హైదరాబాదు, 7. కరీంనగర్, 8. మెదకు, 9. వరంగల్లు, 10. నిజామాబాదు, 11. ఖమ్మం, 12. ఆదిలాబాదు.

ప్రతి పథకానికి రు. 150 లక్షల చొప్పున కేంద్రగ్రాంటు లభిస్తుంది. ఐదు సంవత్సరాలపాటు నిర్వహించే యీ పథకం వల్ల 50,000 మంది సన్నకారు రైతులు, లాభసాటిలేని రైతులు వ్యవసాయ కూలీలకు ప్రయోజనం కలుగుతుంది. 1974–75 సంవత్సరంలో దిగువ పేర్కొన్న జిల్లాలలో 6 సన్నకారు రైతుల అభివృద్ధి ఏజన్సీలను ఏర్పాటు చేయాలని రాష్ట్ర ప్రభుత్వం ఉత్తర్వు చేసింది:

1. ఆదిలాబాదు, 2. హైదరాబాదు, 3. నెల్లూరు, 4. తూర్పుగోదావరి, 5. ఖమ్మం, 6. మెదకు.

ప్రస్తుత సంవత్సరంలో కరీంనగర్, నిజామాబాదు, వరంగల్లు, ప్రకాశం జిల్లాలలో మరో నాలుగు పథకాలను ప్రవేశపెట్టాలని ప్రతిపాదించారు.

వ్యవసాయ పనుల నిర్వహణ నిమిత్తం ఆర్థిక సహాయం అందజేయడానికి స్వల్పకాలిక సహకార పరపతి ఏర్పాటు చేయాలని రాష్ట్ర ప్రభుత్వం సంకల్పించింది. ఈ సంవత్సరం ఖరీఫ్ పంట కాలంలో రు. 42 కోట్లు పంపిణీ చేయాలని ఉద్దేశించారు. గత సంవత్సరం రు. 32 కోట్లు పంపిణీ చేశారు. ఈ యేడు ఇంతవరకు నికరంగా రు. 25 కోట్లు పంపిణీచేశారు. గత సంవత్సరం ఇదే కాలంలో రు. 18 కోట్లు పంపిణీ చేశారు. దానికి తోడు యీ సంవత్సరం శాఖా పరమైన స్వల్పకాలిక రుణాల రూపంలో రు. 5 కోట్లు పంపిణీ చేశారు. గత సంవత్సరం యిదే కాలంలో రు. 80 లక్షలు పంపిణీ చేశారు.

## వ్యవసాయ కార్మికుల కనీస వేతనాలు

వ్యవసాయ రంగంలో ఉపాధి అవకాశాల పరిస్థితిని పరిశీలించి, కనీస వేతనాల సవరణను గూర్చి ప్రభుత్వానికి సలహా యివ్వడానికి 1971 లో ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించింది. కనీస వేతనాల రేట్లను పెంచాలని సంఘం చేసిన సిఫార్సులను ఆమోదించి, 1974 ఆగస్టులో సవరించబడిన వ్యవసాయ కూలీల కనీస వేతనాల రేట్లను ప్రభుత్వం ప్రకటించింది. ఈ కార్యక్రమం ప్రాముఖ్యత దృష్ట్యా కేంద్రప్రభుత్వ ఆదేశాలను దృష్టిలో ఉంచుకొని మొత్తం పరిస్థితిని తిరిగి రాష్ట్ర ప్రభుత్వం పరిశీలిస్తున్నది. నిర్ణయాలను త్వరలోనే ప్రకటిస్తారు.

## అదనంగా 50 లక్షల హెక్టార్ల సాగు

మరో 50 లక్షల హెక్టార్ల భూమికి నీటి పారుదల సౌకర్యం కల్పించాలని ప్రధాన మంత్రి ప్రతిపాదించారు. భూగర్భ జలాల వినియోగానికి జాతీయ కార్యక్రమం రూపొందించాలని అన్నారు. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం ఈ కార్యక్రమంలో గమనార్హమైన పాత్ర నిర్వహించగల స్థితిలో ఉంది. పెద్ద ప్రాజెక్టుల క్రింద 7 లక్షల హెక్టార్ల పైగా నీటి పారుదల సౌకర్యం కల్పించవచ్చు. ఉదాహరణకు నాగార్జున సాగర్ ప్రాజెక్టు, వంశధార ప్రాజెక్టు, తుంగభద్ర ప్రాజెక్టు ఎగువ కాలువ, వంశధార, ఇవి కాక అనేక మధ్య తరహా ప్రాజెక్టులు కూడా ఉన్నాయి.

రాష్ట్ర ప్రభుత్వం నీటి పారుదల పై యీ యేటి ప్రణాళికా పెట్టుబడిని రూ. 49 కోట్ల మేరకు పెంచింది. ఐదవ ప్రణాళికా కాలంలో ప్రాజెక్టులను త్వరితంగా పూర్తిచేయడానికి, నీటి పారుదల సౌకర్యాలను విస్తృతం చేయడానికి కేంద్రం నుండి అదనపు సహాయం కోరడం జరిగింది. వెనుకబడిన ప్రాంతాలకు ప్రత్యేక సహాయం క్రింద రెండేళ్ళలో అదనంగా రూ. 9 కోట్లు కేటాయించిన ఫలితంగా రాష్ట్రంలోని చిన్న తరహా నీటి పారుదల కార్యక్రమం కూడా తీవ్రమైనది.

రాష్ట్రంలో భూగర్భ జలాలను చెప్పకోదగినంతగా వెలికి తీయడానికి చర్యలు తీసుకున్నారు. యింకా ప్రయత్నాలు కొనసాగుతున్నాయి. భూగర్భ జలాలను వాణిజ్యపరంగా ఉపయోగించేందుకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర నీటిపారుదల అభివృద్ధి సంస్థను రూపొందించారు. రాష్ట్ర భూగర్భజలాల బోర్డును పునర్వ్యవస్థీకరించారు. ఆధునిక సాంకేతిక పద్ధతులద్వారా భూగర్భజలాల వనరుల సర్వే జరిపేందుకు సన్నాహాలు చేస్తున్నారు.

## సూపర్ థర్మల్ విద్యుత్కేంద్రాలు

విద్యుచ్ఛక్తి డిమాండు ఎక్కువకావడంతో, దీనిని తట్టుకొనేందుకు ఐదవ ప్రణాళికలో యీ క్రింది ఐదు ప్రధాన ప్రాజెక్టులను నిర్మించడానికి ప్రతిపాదించారు:

1. దిగువ సీలేరు జల విద్యుత్పథకం ($4 \times 1000$ మెగావాట్లు)
2. కొత్తగూడెం థర్మల్ విద్యుచ్ఛక్తి కేంద్రం విస్తృత పథకం ($2 \times 110$ మెగావాట్లు)
3. శ్రీశైలం జలవిద్యుత్ పథకం (110 మెగావాట్లు)
4. నాగార్జునసాగర్ జల విద్యుత్ పథకం ($4 \times 110$ మెగావాట్లు)
5. విజయవాడ థర్మల్ విద్యుచ్ఛక్తి పథకం ($1 \times 200$ మెగావాట్లు)

1975–76 సంవత్సరంలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తికై రాష్ట్ర ప్రణాళికా పెట్టుబడిని రూ. 53.50 కోట్లకు పెంచారు. ఇది సరిపో

నందునా, వస్తువుల ధర, కూలీరేటు మొదలైనవి పెరగటం వలన ప్రాజెక్టుకయ్యే అదనపు వ్యయాన్ని తట్టుకొనేందుకు భారత ప్రభుత్వాన్ని రూ. 12.4 కోట్ల సహాయం చేయాలని అర్థించడం జరిగింది.

రామగుండంలోగాని, కొత్తగూడెంవద్దగాని కేంద్రరంగంలో ఒక సూపర్ థర్మల్ కేంద్రాన్ని స్థాపించాలని భారత ప్రభుత్వానికి రాష్ట్ర ప్రభుత్వం నచ్చజెప్పింది. కేంద్ర ప్రభుత్వం వారు ఈ ప్రాజెక్టు విషయంలో వివరణాత్మకంగా పరిశోధించాలని సెంట్రల్ ఎలక్ట్రికల్ అథారిటీని కోరినట్లుగా రాష్ట్ర ప్రభుత్వానికి తెలియజేశారు.

## చేనేత పరిశ్రమ

## స్టాండర్డు వస్త్రాల నాణ్యత

చేనేత రంగంలో కంట్రోలు వస్త్రాల ప్రత్యేక కేటాయింపుల విషయమై దక్షిణాది రాష్ట్రాల చేనేత శాఖ మంత్రులు ప్రధాన మంత్రిని, కేంద్ర వాణిజ్యమంత్రిని కలుసుకున్నప్పుడు ప్రస్తావించారు. కేంద్ర సహాయంతో రాష్ట్రాలు కొన్ని నూతన పథకాలను చేపట్టే విషయాన్ని భారత ప్రభుత్వం పరిశీలిస్తున్నది. చేనేత వస్త్రాల నిల్వలను విడుదలచేసేందుకు, నిల్వ చేనేత వస్త్రాలను తగ్గింపు ధరలకు విక్రయించాలని అపెక్సు సొసైటీకు ప్రాథమిక సంఘాలకు ఉత్తరువులు చేశారు. ఇందులో పది శాతం మేరకు నష్టాన్ని రాష్ట్ర ప్రభుత్వం సబ్సిడీ రూపంలో పూరిస్తుంది. ఈ మధ్యనే ప్రారంభింపబడిన రాష్ట్ర జవుళి కార్పొరేషన్ సహకార రంగం పరిధిలోలేని చేనేత వస్త్రాల నిల్వల విడుదల కొరకు చర్యలను సూచిస్తుంది. చిన్నతరహా నూలు మిల్లుల స్థాపన, పట్టు పరిశ్రమాభివృద్ధి, ప్రభుత్వ ఫ్యాక్టరీల స్థాపన మొదలయినవి యీ కార్పొరేషన్ నిర్వహించాల్సిన యితర పనులు.

## నగరంలో ఖాళీ స్థలాల సమాజీకరణ

1972 సంవత్సరంలో, ఖాళీగావున్న పట్టణపు భూములను యితరుల పరం చేయడాన్ని నిషేధిస్తూ ఒక చట్టాన్ని రూపొందించారు.

## విలాసవంతమైన సౌధాల విలువల మదింపు

ఆస్తికి తక్కువ విలువకట్టి పన్నును ఎగవేసే పద్ధతి స్టాంప్ డ్యూటీ విషయంలో జరుగుతున్నది. ఆస్తుల వాస్తవికమైన విలువల ప్రాతిపదికగా స్టాంప్ డ్యూటీ వసూలు చేయడానికి రిజిస్ట్రేషన్ అధికారులకు అవకాశం కల్పించడానికి వీలుగా కొంత కాలం క్రిందట రాష్ట్ర శాసన సభ స్టాంపుల చట్టానికి సవరణను ఆమోదించింది. 1975 ఆగస్టు 16వ తేదీ నుండి దీనిని అమలులోనికి తేవాలని ప్రతిపాదించారు.

## స్మగ్లర్ల ఆస్తుల స్వాధీనం

## పెట్టుబడుల విధానం సడలింపు

ఈ అంశాలు కేంద్రస్థాయిలో చర్య తీసుకోదగినవయినప్పటికీ, చర్యలను అమలుచేయడంలో కేంద్రప్రభుత్వంతోనూ, తత్సంబంధమైన ఏజన్సీలతోనూ రాష్ట్ర ప్రభుత్వం పూర్తిగా సహకరిస్తుంది.

## పరిశ్రమల్లో కార్మికుల ప్రాతినిధ్యం

ఇటీవల ఢిల్లీలో జరిగిన కార్మికశాఖ మంత్రుల సమావేశములో ఉత్పత్తి స్థాయినుండి ఫ్యాక్టరీ స్థాయివరకు యజమానులు, కార్మిక ప్రతినిధులతో కూడిన ఒక కన్సల్టేటివ్ కమిటీని నెలకొల్పాలని నిశ్చయానికివచ్చారు. ఇప్పటికే దీనిని సూత్రప్రాయంగా ఆమోదించిన కొన్ని రాష్ట్రాల్లోనూ ఆంధ్రప్రదేశ్ ఒకటి. ఒక కంపెనీలో అప్పుడే కార్మికుణ్ణి డైరెక్టర్ల బోర్డులో సభ్యుడుగా నియమించారు. కన్సల్టేటివ్ కౌన్సిళ్ళ స్థాపన వివరాలు, అవి పనిచేసే విధానం రూపొందించబడుతున్నాయి.

## రోడ్డు రవాణా జాతీయ పర్మిట్ విధానం

అఖిలభారతస్థాయిలో సరకుల రవాణా వాహనాలకు ఒకే జోన్ పథకం ప్రవేశపెట్టే విషయం అంతర్రాష్ట్ర రవాణా కమీషన్ పరిశీలనలో వుంది. ఈ ప్రతిపాదనకు రాష్ట్రప్రభుత్వం సూత్రప్రాయంగా అంగీకారం తెలుపుతూ పర్మిట్ల సంఖ్యపై పరిమితిని విధించకుండాను, రవాణా వాహనాలు నడిపే ప్రతివ్యక్తి యితర రాష్ట్రాలకు చెల్లించాల్సిన పన్నును తగ్గిస్తూను యీ పథకం అమలు జరపవచ్చునని సూచించింది. ఈ విషయం భారత ప్రభుత్వం పరిశీలనలో వుంది. ఇది యిట్లా వుండగా, యీ రాష్ట్రానికి, కొన్ని యితర రాష్ట్రాలకు మధ్య ఒక సమీకృత పర్మిట్ పథకం యిప్పుడు అమలు జరుగుచున్నది.

## ఆదాయపు పన్ను మినహాయింపు పరిమితి

## రు. 6 వేలనుండి రు. 8 వేలకు హెచ్చింపబడింది.

## విద్యార్థులకు అత్యవసర వస్తువుల సరఫరా

హాస్టల్ విద్యార్థుల సహాయక కార్యక్రమం ప్రకటించడానికి ముందుగానే, హాస్టల్ విద్యార్థుల విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలని కలెక్టర్లను ఆదేశించారు. కేటాయింపు విధానంలో తగినంత బియ్యాన్ని హాస్టల్ విద్యార్థుల కోసం ప్రత్యేకించవలసిందనీ హాస్టల్ విద్యార్థులకు కావల్సిన ఆహార ధాన్యాలు, పంచదార మొదలైన నిత్యజీవితావసర వస్తువులు పంపిణీ అయ్యేటట్లు చూడాలనీ కలెక్టర్లను కోరడం జరిగింది.

## కంట్రోలు ధరలకు పుస్తకాలు, స్టేషనరీ

జాతీయంచేసిన పాఠ్యపుస్తకాలను, స్టేషనరీని, కంట్రోలు ధరలకు పంపిణీ చేసేందుకు అప్పుడే ఏర్పాట్లు జరిగాయి.

1975-76 లో జాతీయం చేసిన పాఠ్యపుస్తకాలను 100 లక్షలు ముద్రిస్తారు. అంతకుముందు సమారు 70 లక్షలు ముద్రింపబడేవి. ఇది సుమారు 40 శాతం ఎక్కువ. ఈ పని అంతా టెక్స్టుబుక్ ప్రెస్‌కు అప్పగించబడింది. 80 లక్షల పుస్తకాల

ముద్రణ పూర్తయింది. 11 ప్రాంతీయ విక్రయడిపోలకు పంపిణీ కోసం అందించారు. తతిమ్మాపుస్తకాల ముద్రణ 1975 ఆగస్టు నెలాఖరులోగా పూర్తి చేస్తారు. సకాలంలో విద్యార్థులకు అందే విధంగాను, కృత్రిమ కొరతలను నివారించేందుకు, ప్రభుత్వం పుస్తకాల పంపిణీ విధానాన్ని సవరిస్తుంది. షెడ్యూలు కులాలు, షెడ్యూలు తరగతులకు చెందిన విద్యార్థులకు అవసరమయ్యే వాటికై ప్రత్యేకంగా ఏర్పాట్లు చేయబడ్డాయి. ఎక్సర్‌సైజ్ పుస్తకాల విషయమై నోటు పుస్తకాలను తయారుచేసే రిజిస్టరయిన సంఘాలకు కంట్రోలు ధరకు కాగితం కేటాయిస్తున్నారు. వీరు విద్యాశాఖ నిర్ణయించిన ధరకు నోటుపుస్తకాలను పంపిణీ చేస్తారు. విద్యాశాఖ యీ పుస్తకాలపంపిణీ విధానంపై పర్యవేక్షణ జరుపుతోంది.

## అప్రెంటిస్‌షిప్ పథకం

కొద్ది సంవత్సరాల నుండి అప్రెంటిషిప్ చట్టం అమలు జరపబడుతున్నా వివిధయూనిట్లలో అప్రెంటిస్‌ల నియామకం సంతృప్తికరంగా లేదు. ఇది అనేక కారణాలవల్ల ఏర్పడింది. ఈ అసమగ్రతను నివారించి, యీ విషయంలో ఇప్పుడున్న 41 శాతం స్థాయినిత్వరలో తగినంతగా పెంచడానికి పరిస్థితిని సమీక్షిస్తున్నారు. తగుచర్యలు తీసుకుంటున్నారు.

[ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ నూతన ఆర్థిక కార్యక్రమం దృష్ట్యా రాష్ట్రంలో అమలు చేయనున్న చర్యలను ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు జూలై 30 న రాష్ట్ర శాసన సభలో వివరించారు. ప్రసంగం సారాంశం యీ క్రింద యివ్వబడింది— సం]

వెట్టిచాకిరి చేయించడం అమానుషం. దీనిని నిర్మూలించాలి. ఇటువంటి వెట్టిచాకిరి చేయించుకోడానికి సంబంధించిన అన్నిరకాల ఒప్పందాలూ, తదితర ఏర్పాట్లూ చట్టవిరుద్ధమైనవి.

ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ



# చేనేతకు చేయూత

శ్రీ కె. వి. కేశవులు



మన ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి ప్రకటించిన 20 సూత్రాల పథకంలో చేనేత పరిశ్రమను చేర్చడం, వ్యవసాయం తర్వాత అధిక సంఖ్యాకులకు జీవనోపాధి నిచ్చేది చేనేత పరిశ్రమ అని అభివర్ణించడం చరిత్రాత్మకమైన విశేషం. మన దేశంలో మూడు కోట్ల జనాభా కల్గిన చేనేత పనివారు ఇంగ్లీషు వారి పరిపాలనలో వస్త్ర పరిశ్రమలో తమ స్థానాన్ని పోగొట్టుకున్నారు. దేశంలో మిల్లులు వచ్చిన తర్వాత చేనేత వారు దిక్కులేని దీనావస్థకు దిగజారిపోయినారు. గాంధీజీ తన స్వరాజ్య సంపాదనోద్యమములో పల్లెసీమలకు, అక్కడి సజీవమైన చేతివృత్తుల ప్రోత్సాహానికి ఎంతో ప్రాధాన్యత నిచ్చారు.

మన దేశంలో 35 లక్షల చేనేత మగ్గాలున్నాయి. 50 లక్షల కుటుంబాల జీవనోపాధికి తోడ్పడే ఈ పరిశ్రమ శిథిలమై నిర్జీవమైపోయింది. 35 లక్షల మగ్గాలు రోజుకు 10 రూపాయల ఉత్పత్తి చేస్తే, మూడున్నర కోట్ల వస్త్రోత్పత్తి చేస్తాయి. కాని సగం మగ్గాలైనా చేతినిండా పని కల్గివున్నాయని చెప్పడానికి నాకు ధైర్యం చాలడం లేదు.

దేశంలో ఉత్పత్తి అయిన వస్త్రంలో నూటికి 47 శాతం చేనేత వారి భాగం. నిజంగా 35 లక్షల మగ్గాలు పని చేసిననాడు దేశ ప్రజలకు కావలసిన వస్త్రాల్ని చేనేత పరిశ్రమ అందించగలదు. చేనేత వస్త్రం మిల్లు వస్త్రంతో పోటీ పడజాలదు. నాణ్యతలో, మన్నికలో కళాత్మకంగా మిల్లు వస్త్రాన్ని తలదన్నినా ధరలో మాత్రం మిల్లుతో పోటీ పడలేని నిస్సహాయ స్థితిలో వున్నది. దానికి కారణాలు:—ఒకటి: మిల్లునుండి నూలు చేనేత మగ్గానికి చేరేసరికి 100కి 25 రూపాయలు ధర పెరుగుతున్నది. రెండవది: ఈ పారిశ్రామికునికి కావలసిన రంగులు, రసాయనాలు నూటికి మూడింతలు, నాలుగింతల ధరకు చేరుతున్నవి. చేనేత పరిశ్రమకు స్వంత నూలు ఉత్పత్తి సాధనాలుకాని, స్వంత రంగు రసాయన ఉత్పత్తి అవకాశాలు కాని ప్రస్తుతం లేవని చెప్పవచ్చు.

చేనేతకున్న నాణ్యత, కళానైపుణ్యం విదేశీయులనెంతో ఆకర్షిస్తున్నవి. కోట్లాది విలువచేసే చేనేత వస్త్రాలు, చేనేత దుస్తులు ఎగుమతిచేసే అవకాశం వున్నది. భారత ప్రభుత్వంవారు ఇస్తున్న (ప్రోత్సాహాలు)కాని ఇతర ప్రోత్సాహాలుకాని మిల్లు వారితో సమానంగా ఇస్తే ఎలా సరిపోతుంది చెప్పండి? పేదవాడికి, నిస్సహాయ పరిశ్రమకు కొంచెం అధిక ప్రోత్సాహాన్ని ఇవ్వవలసిన అవసరంలేదా? చేనేత వస్త్రాలు ధరలో మిల్లుకన్నా అధికంగా వుంటాయని కాబోలు మనవారు మిల్లు వస్త్రాలమీద మోజు చూపుతున్నారు. ధరలను ఆకర్షణీయంగా చేయడానికి మన ప్రభుత్వాలు రిబేటు రూపంలో కొన్ని కోట్ల రూపాయలు ఖర్చుచేస్తూ వచ్చాయి. కాని ఫలితం అనుకున్నట్టు రాలేదు. కష్టించి ఉత్పత్తి చేసే చేనేత కార్మికుని వేతనం నాటికీ నేటికీ పెరగలేదు. కొనుగోలుదారుకు తక్కువ ధరకు వస్త్రము అందుబాటు కావడంలేదు. మరి వస్త్రం నిలువలు పెరగక యేమి చేస్తుంది? మరి ఇన్ని కోట్ల రూపాయలు ఎందుకు ఖర్చుపెట్టినట్లు?

మన ఆంధ్ర రాష్ట్రంలోనే చూడండి. గత పది సంవత్సరాలలో 9 కోట్ల రూపాయలు మనం ఖర్చు చేసినాము. నా అభిప్రాయంలో మనం ఆశించిన సత్ఫలితాలు రాకపోగా కొన్ని దుష్ఫలితాలు సంక్రమించాయి. రిబేటు కారణంగా ఉత్పత్తి విడుదల లేకుండానే రిబేటు పొందే అవకాశానికి—ధరలు పెంచే మనస్తత్వానికి మనం దారి చూపినట్లయింది. అందుచేతనే మనం రిబేటును మాను కొని దానికి బదులుగా ఆ ధనాన్ని పరిశ్రమకు, పారిశ్రామికునికి ఉపయోగపడి. కొనుగోలుదారుకు లాభసాటికాగల మార్గాలను అనుసరిస్తున్నాము.

మన రాష్ట్రంలో 5 నుండి 6 లక్షల మగ్గాలున్నాయి. దాదాపు 2.5 లక్షల మగ్గాలు 800 సహకార సంఘాలలో చేరినా అందులో సగం మాత్రమే బాగా పనిచేయగలుగుతున్నాయి. ఈ ప్రాథమిక సంఘాలు చేసిన ఉత్పత్తిని అమ్మకం చేయించడానికి కేంద్ర సంఘాలు రెండు వున్నాయి. తెలంగాణా ప్రాంతానికి ఒకటి. ఆంధ్ర జిల్లాకు ఇంకొకటి. ఈ మధ్యనే రాయలసీమకు మరొక కేంద్ర సంఘం కూడా స్థాపించడం జరిగింది. ఈ కేంద్ర సంఘాలు ప్రాథమిక సంఘాలవద్ద నున్న ఉత్పత్తిని విడుదల చేయించే బాధ్యత కలిగివున్నా నూటికి 25 నుండి 40 శాతంకు మించి వారు చేయజాలడంలేదు. మిగతా వస్త్రం ప్రాథమిక సంఘాలవద్ద నిలిచిపోతున్నది. కేంద్ర సంఘాలకు మన ప్రభుత్వం 2.5 కోట్ల రుణాన్ని మంజూరు చేసింది. ఇది ఇలావుండగా ప్రధాని 20 సూత్రాల పథకం క్రింద మరొక 2.5 కోట్లు మనం ఈ నిలువల విడుదలకై కేటాయించినాము. దీనివల్ల కేంద్ర సంఘాల కొనుగోలు శక్తి రెట్టింపు అవుతుంది. 800 సంఘాలలో దాదాపు 300 సంఘాలు మూలపడి వున్నాయి. బాగుపడే యోగ్యతలేని సంఘాలను వెంటనే రద్దు చేయడంతోబాటు మిగిలిన వాటిని సత్వరంగా స్వయంపోషకం చేయడానికి ఒక కోటి రూపాయలు కేటాయించాము.

సహకార రంగంతో సంబంధంలేక చేనేత నిపుణుల క్రిందనో లేక స్వతంత్రంగానో పని చేసుకుంటున్న నేతవారున్నారు. వారికోసం 50 ఉత్పత్తి కేంద్రాలను స్థాపిస్తున్నాము. ఈ ఉత్పత్తికి కేంద్రాలు 100 మగ్గాలు. వీలైనంతవరకు అధునాతనమైన చేనేతమగ్గాలు కల్గివుంటాయి. ఇక్కడిఉత్పత్తికి మేము ఇచ్చే నమూనాలు నాణ్యత కల్గి వుంటాయి. మేము ఎగుమతులకు, రెడీమేడ్ దుస్తులకు పనికి వచ్చే వస్త్రాన్ని మాత్రం ఈ కేంద్రాలలో ఉత్పత్తి చేయాలని సంకల్పించాము. నూలు, రంగులు మేము సరఫరా చేస్తాము. ఈ కేంద్రాలకు ఒకటిన్నర కోటి రూపాయలు కేటాయించినాము.

చేనేత పరిశ్రమకు కావలసిన ముడి సరుకులలో ప్రధానమైంది నూలు. మనకు 5 సహకార స్పిన్నింగు మిల్లులు వున్నాయి. వాటి ఉత్పత్తి బాగానే వుంది. కాని చేనేత వారికి ఇతరులకన్న తక్కువ ధరకు నూలు లభించేలాగా వాటిని పునర్వ్యవస్థీకరణ చేయాలనుకుంటున్నాము. ఇంతవరకు వీరు నూలును కేంద్ర సంఘాలద్వారా అమ్మేవారు. ప్రాథమిక సంఘాలకు చేరేలోగా ఈ నూలుకు కూడా ధరపెరుగుతూ వచ్చింది. ఎన్ని చేతులు మారితే అంత మురికి అంటుతుందిగదా? అందుకే ఈ నూలును నేరుగా మన 50 ఉత్పత్తి కేంద్రాలకు సరఫరాచేసి వస్త్రోత్పత్తి చేయించాలని సంకల్పించాము.

మన 6 మిల్లులు ఉత్పత్తిచేసే మొత్తం నూలు మన అవసరంలో 10 శాతం మాత్రమే. మన రాష్ట్ర ప్రైవేటు మిల్లులు కూడా కలిసి మన అవసరాల్లో 25 శాతం. అంటే 1.5 లక్షల బేళ్లు మాత్రమే ఉత్పత్తి చేస్తున్నాయి, మిగతా 45 లక్షలబేళ్లు మనం ఇతర రాష్ట్రాల ప్రైవేటు మిల్లుల నుండి తెచ్చుకుంటున్నాం. మనది ప్రత్తి పండించే రాష్ట్రమైనా అధిక ధరలకు నూలు కొనుక్కుంటున్నాం. అందుచేతనే మరొక 30 స్పిన్నింగు మిల్లులకు లైసెన్సులు ఇమ్మని కేంద్ర ప్రభుత్వాన్ని కోరినాం. ఒక నూలుమిల్లు స్థాపించడానికి 4 కోట్ల రూపాయలు, 5 సంవత్సరాల కాలం పడుతుంది. అంత వరకు మనం ఎలా ఆగగలం?

అందుచేత మనం మరి రెండు చక్కని పథకాలను చేపట్టినాము, ఒకటి చిన్నతరహా స్పిన్నింగుమిల్లు. 864 కదుళ్లతో 5 లక్షల రూపాయలతో 6 నెలల కాలంలో స్థాపించుకోవచ్చు. ఈ పథకానికి 50 లక్షల రూపాయలు కేటాయించినాము. ఒక చిన్నతరహా మిల్లుకు అప్పుడే ఆర్డరు ఇచ్చాం కూడా. మరొక పథకం—సిల్కు ఉత్పత్తికి సంబంధించింది. సిల్కు పరిశ్రమ వ్యవసాయ

(తరువాయి 41 వ పుటలో)

# మచిలీపట్నం వరి పరిశోధన కేంద్రం

**ఆంధ్రప్రదేశ్‌లో వున్న 14 వరి పరిశోధన కేంద్రాల్లో ఒకటైన మచిలీపట్నం కేంద్రంలోని పరిశోధన ప్రశంసా పాత్రమైనది.**

కోస్తా తీరంలో సుమారు 600 మైళ్ళు పైబడిన ప్రాంతం భూములు ఉప్పు, చవిటివి కావడంవల్ల ఈ ప్రాంతాల్లో ఉపయోగానికిగాను 1954 నుండి మచిలీపట్నంలో ఎన్నో పరిశోధనలు జరిపి పలు రకాలను ఎన్నిక చేయటమేగాక వాటి ద్వారా ప్రయోగాలు చేసి చూపించటం కూడా జరుగుతున్నది.

ఆంధ్రప్రదేశ్ లోని 14 పరిశోధన జరిపే స్థానాల్లో ఒక్కొక్కటి ఒక్కొక్క సమస్యపైన పరిశోధనలు జరుపుతాయి. రాష్ట్రంలో పెద్దది ప్రధానమైనది మారుటేరు (ప. గో. జిల్లా). ఉభయ గోదావరి, కృష్ణా జిల్లాల్లో పనికివచ్చే (డెల్టా) వరి వంగడాలు ఎన్నిక చేస్తారు.

ఆంధ్రప్రదేశ్‌లో 2.50 లక్షలనుండి 3 లక్షల ఎకరాలు ఉప్పు, చవిటి భూములు వున్నాయి. స్థానికంగా దేశవాళీ వరి రకాలు, కేరళకు చెందిన కుతార్, కో-18 (తెల్లకారు) ఎన్నుకుని ఎం. ఎస్. ఎం. 1 ని క్రాస్‌చేసి రూపొందించటం జరిగిందిక్కడ. ఇవి తెల్లబియ్యం, గరికలు (పాటిన్) ఇవి దాళ్వాకు 125 రోజుల గడువుతో పంట చేతికి వస్తుంది ఎం ఎస్ ఎం. 2 కూడా అదే గడువులో పండుతుంది. దీనిని దాళ్వా అక్కుళ్ళు (1032) అంటారు మంచి ప్రసిద్ధి చెందింది. భూసారాన్నిబట్టి దిగుబడి యిస్తుంది.

సార్వాకు అక్కుళ్ళు, క్రాస్ ఎస్పొట్టిడి, 6 బి, ఎస్ ఆర్. కల్చరు 10032, 10034 రకాలను జయతో మచిలీపట్నం కేంద్రంలో క్రాస్‌చేసి రూపొందించటం జరిగింది.

ఈ ప్రాంతాలను మొత్తం అయిదు రకాలుగాను, 3 తరగతులుగాను విభజించారు మొదటి తరగతి భూముల్లో 12 నుండి 13 బస్తాలు, తేలిక నేలలలో 12 నుండి 15 బస్తాలు, మధ్యతరహా భూమిలో 8 నుండి 12 బస్తాలు దిగుబడి వస్తుంది. నీటి సౌకర్యం సమృద్ధిగా వుంది. ఇతర పంటలకన్నా వరికే ప్రాధాన్యత యివ్వబడుతున్నది. ఇందులో సోడియం క్లోరైడ్ తీవ్రంగా వుంది. ఈ కేంద్రానికి సముద్రం ఒకటిన్నర మైళ్ళ దూరంలో వుండటంవల్ల సముద్రపు పోటును తట్టుకోవల్సి వుంటుందనీ, ఈ బాధను తట్టుకునే అధిక దిగుబడి రకాలను గురించికూడా ఈ కేంద్రంలో పరిశోధనలు జరుగుతున్నాయనీ పరిశోధనా కేంద్రం (బందరు) అధికారి శ్రీ కె. ఎస్ రాధాకృష్ణమూర్తి చెప్పారు.

ఈ కేంద్రంలో జరిగే పనులను స్వయంగా చూచేందుకు వ్యవసాయశాఖవారు దినపత్రికల విలేకర్లకు అవకాశం కల్గించారు.

ఉప్పువల్ల మొక్క ఈనె కరలు తగ్గిపోతాయనీ, జింకు ఈ భూముల్లో తక్కువనీ, అందుచేత దేశవాళీ రకాలే పండించబడుతున్నాయనీ మరికొన్ని నిధులు కేటాయిస్తే కొత్త పరిశోధనలకు అవకాశాలుంటాయనీ, వున్న నిధుల కనుగుణంగా కొంతవరకే యీ పరిశోధనలు పరిమితమయినట్లు పరిశోధన కేంద్రం అధికారి అన్నారు.

**శ్రీ పిడుగు రామలింగయ్య**

ఎకరాకు 3 లేక 4 టన్నుల జింకు తోలించి వరిగడితోలిస్తే పరిస్థితులు మెరుగయ్యే అవకాశాలుంటాయని చెప్పబడింది.

సార్వా సీజనులో మధ్యతరహా భూముల్లో మసూరీ పంట యిచ్చిన ఫలితం ఆశాజనకంగా వుందనికూడా అధికారి శ్రీ రాధాకృష్ణ వివరించారు

వరి పంటకు నారు వేసేకంటే విత్తనం వేయటం జరగాలనీ, నారు లేతదిగాని, ముదురుది గాని దెబ్బతినటం జరుగుతూ వుంటుందనీ, కనీసం దాళ్వాలలోనైనా నారుకు బదులు విత్తనం వాడటం జరగాలని కూడా ఈ అధికారి అన్నారు.

హెచ్చుపాళ్ళలో సోడియం, పొటాషియం, మెగ్నీషియం, కాల్షియంయొక్క కార్బొనేట్లు, బైకార్బొనేట్లు, క్లోరైడ్ వునికి భూమిలో వుండటంవల్ల మొక్కలు దెబ్బతినటం జరుగుతుంది. ఈ రకపు భూములను సారవంతంచేసి సాగులోకి తేవాలంటే పచ్చిఆకు రొట్టవేసి, వరిగడ్డి త్రొక్కించటం, పశువుల ఎరువు అధికంగా ఉపయోగించటం, చెరకు ఫ్యాక్టరీలలోని పిప్పి చొప్పను త్రొక్కించటంలాంటి పద్ధతులు వాడుకలో వున్నాయి. జిప్సం ఎకరాకు 4 టన్నులు, గంధకం ఎకరాకు 1–2 టన్నుల వంతున వాడినచో చవుడు విరుగుతుంది. కృష్ణా, గోదావరి జిల్లాలలో వరి మళ్ళలోనికి నీరు పుష్కలంగా పారించి ఉప్పును కొట్టుకు పోయేందుకు వీలుగా మురుగు బోదెలద్వారా వదిలి వేయటం మామూలు. కాని ఈపద్ధతుల వల్ల తాత్కాలికంగా మార్పులు కనిపిస్తాయి. పైగా విశేషంగా యిందుకు ఖర్చు చేయాల్సివుంటుంది.

అన్నిరకాల పంటల్లోనూ వరి ఒక్కటే చవిటి భూములను ఫలదాయకంగా చేసేందుకు తోడ్పడుతుంది నీళ్ల సమృద్ధిగా పారించితే గాని మళ్లలోని ఉప్పు కొట్టుకుపోయేందుకు వీలుండదు. నీళ్లధికము అయినప్పుడు ఒక వరి పైరుకు మాత్రమే ఉపయోగ పడుతుంది.

కొన్ని దేశవాళీ వరిరకాలు స్వతహాగా క్షారమును తట్టు కోగలశక్తి కల్గివుంటాయి మనరాష్ట్రంలోని తెల్లతోక వడ్లు, బైరువడ్లు, చెన్నంగి, ఎర్రకేసరి బుడమొలగొలుకులు మొదలైన వరి రకాలను చవిటి వడ్లని కూడా పిలవటం జరుగుతూవుంటుంది.

ఉప్పు, చవిటి నేలలకు అనువైనవరి వంగడాల భారతీయ వ్యవసాయ పరిశోధనా సంస్థ మచిలీపట్నంలో ఒక కేంద్రం స్థాపించింది. ఇది 1966 నుండి ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం ఆధ్వర్యంలో నిర్వహించబడుతున్నది. గత 19 ఏండ్లుగా పరిశోధనలు జరిపి కనుగొన్నవి ఎన్నోవున్నా. ప్రధానంగా కొన్ని మాత్రమే యిక్కడ పొందుపరచటం జరిగింది.

తమిళనాడు, కేరళ, మహారాష్ట్ర, ఒరిస్సా, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాల నుండి 21 చవిటి వరిరకాలను, 171 దేశవాళీ వరిరకాలను రప్పించి పరిశీలించి చూడగా ఈ చవిటి భూముల క్షార పరిస్థితులకు తట్టుకోలేక పోయాయి. గరిక, సన్నవరి (ఎం. టి. యు–9) మాత్రమే కొంతవరకు తట్టుకోగలిగాయి అక్కుళ్లు. బుడమొల గొలుకులు. తెల్లకేసరి, ఎర్రకేసరి, పొట్టికేసరిలాంటి దేశవాళీ రకాలు గురించి ప్రయత్నించగా నెల్లూరు జిల్లా సగిచర్ల ప్రాంతము నుండివచ్చిన బుడమొలగొలుకులుమాత్రమే తృప్తికరంగా క్షారాన్ని తట్టుకోగలవని తేలింది. ఈ దేశవాళీరకము నుండి ఎన్నుకున్న వంగడము నెం 1032 ఉత్తమమైనదిగా నిర్ణయించబడింది

ఈ వంగడాన్ని 1959 నుండి నాలుగేళ్ళు కృష్ణా, ఉభయ గోదావరి జిల్లాల్లోనూ, ప్రైవేటు రైతుల భూముల్లోనూ ప్రయత్నించగా ఉప్పుభూములకు ఎంతో అనుకూలమైన రకంగానూ, గరికవరికన్న ఉత్తమరకంగానూ ఎన్నిక చేయబడి, 1966 లో ఎం.సి.ఎం–2 పేరున ఈ వంగడాలు విడుదల చేయటం జరిగింది

ప్రస్తుతం తూర్పు కోస్తాప్రాంతంలో ఈ వంగడం చాలా మాగాణిలోవుంది. దేశవాళీ రకాలనేగాక సంకర పద్ధతిలో కో. 1 అనేరకము "కుధీర్" అనేవరిరకాల కలయికతో కొత్త వరివంగడం కనుగొనటం దానికి నెం 1327 పేరు పెట్టటం జరిగింది. గరికసన్న వరి రకము కంటే మేలైనందున ప్రజాదరణ పొందటం వల్ల 1965 లో ఎం సి ఎం 1 అన్న పేరిట విడుదల చేయటం జరిగింది. ఈ ఎం. సి. ఎం 1, 2 ఈ రెండు రకాలు కూడా నాలుగుమాసాలలో కోతకు వస్తాయి. దాళ్వా పంటకు ఎంతో ఉపయోగకరమైనది అంతేగాక మహారాష్ట్ర, ఒరిస్సానుండి వెలుగు లోకి వచ్చిన వరిరకాల కంటె ఎన్నో మేలైన లక్షణాలు కలిగి వున్నాయి ఎం.సి ఎం–2 ఎంతో చలామణి అయి దాళ్వా అక్కుళ్లు పేరుతో వ్యవహరింప బడుతున్నాయి.

సార్వాపంటకు సంకర పద్ధతిలో యిచ్చట అక్కుళ్లు ఎస్.ఆర్. 26 బి, వరిరకాల కలయికతో రూపొందిన రెండు రకాల వరివంగడాలు 10022, 10034 కూడా ఎక్కువ ఉపయోగకరమైనవి. ఈ మధ్య మసూరి వరిరకము కూడా ఈ ప్రాంతం పరిస్థితులకు అనుకూలంగా వున్నట్లు తేలింది.

ప్రస్తుతం నూతనంగా రూపొందించిన ఐ. ఆర్-8, జయ మొదలైన వాటిని ఉపయోగించి సంకర పద్ధతిలో ఉప్పు చవిటి భూములకు ఉత్తమమైన పొట్టి వంగడాలను కనుగొనేందుకు ఈ కేంద్రం కృషి చేస్తున్నది.

---

మన జనాభాలో ఎక్కువమంది గ్రామీణ ప్రాంతాల్లో నివసిస్తున్నారు. ఇనుమడించిన ఉత్సాహంతో మనం భూసంస్కరణల చట్టాన్ని అమలు జరిపి, భూమిలేని పేదలకు మిగులు భూమిని పంపిణీ చేయాలి.

ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ

---

చిత్రవాణి

# మన రాష్ట్రంలో టెలివిజన్



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ఆగస్టు 1న బహదూర్‌గూడాలో ఉపగ్రహంద్వారా పనిచేసే టెలివిజన్ విద్యాబోధవ ప్రయోగాత్మక కార్యక్రమాలను ప్రారంభించారు.

మన దేశంలో ఢిల్లీ, బొంబాయి, పూనా, అమృత్‌సర్ నగరాలూ, ఆపరిసర ప్రాంతవాసులకే ఇంతవరకు 'చిత్రవాణి' (టెలివిజన్) కార్యక్రమాలు చూచి ఆనందించే భాగ్యం కలిగింది. కాని ఈ ఆగస్టు నెల మొదటి తేదీనుండి గ్రామీణ ప్రజలుకూడా 'చిత్రవాణి' కార్యక్రమాలు చూస్తున్నారు గ్రామాలలో ప్రభుత్వంవారే పాఠశాలల్లోనూ, పంచాయతీ ఆఫీసుల్లోనూ ఈ టెలివిజను సెట్లును అమర్చారు

మనదేశంలో ప్రయోగాత్మకంగా 'టెలివిజను' ద్వారా సాయం సమయాలలో గ్రామీణ ప్రజలకు వ్యవసాయం, పశుపోషణ, పాడి పరిశ్రమ, కోళ్ల పరిశ్రమ, గృహ పరిశ్రమలు, స్త్రీ జనాభ్యుదయం, పిల్లలరక్షణ, పోషణ; కుటుంబనియంత్రణ; ప్రజారోగ్యం మొదలగు అంశాలపై కార్యక్రమాలను రూపొందించి చూపించడమే గాకుండా ఉదయం 10 గం. నుండి ఒక గంటన్నరసేపు 6 నుండి 12 సంవత్సరాల వయస్సుగల విద్యార్థులకు విద్యాబోధనకు సంబంధించిన కార్యక్రమాలు కూడా చూపించబడుతున్నాయి. ఖర్చులేకుండా గ్రామీణ ప్రజలు యీ కార్యక్రమాలే గాకుండా, నాటికలు, సంగీత, నృత్య కార్యక్రమాలను కూడా చూస్తున్నారు.

## అంతరిక్షం నుండి కార్యక్రమ ప్రసారాలు

అంతరిక్షంలో కొన్ని వేల కిలోమీటర్ల దూరంలోగల అంతరిక్షనౌక (సెటలైటు) ద్వారా ఈ కార్యక్రమాలు దేశంలో ఏ ప్రాంతంలోనైనా చిత్రవాణి (టెలివిజను) ద్వారా చూడవచ్చు.

ఈ అంతరిక్షనౌక ఒకే సారి రెండు భాషలలో శబ్దాన్ని, ఒకే మాదిరి చిత్రాన్ని ప్రసారం చేస్తుంది. అంటే ఒక చిత్రం చూస్తూవుంటే ఇటు తెలుగులో ఆంధ్రప్రదేశ్ లోనివారు వింటూ వుంటే అటు కర్నాటక రాష్ట్రంలో అదే చిత్రం చూస్తూ వ్యాఖ్యానాన్ని, సంభాషణలను కన్నడంలో వినగలరు.

భారత దేశంలో ప్రస్తుతం 2400 గ్రామాలలో నివసించే వారికే ఈ అవకాశం కలుగుతుంది. దేశంలో ఆరు రాష్ట్రాలలో— ఆంధ్రప్రదేశ్, కర్నాటక, మధ్యప్రదేశ్, ఒరిస్సా, రాజస్థాను, బీహారు రాష్ట్రాలలో మాత్రమే—అందులోనూ మూడు లేక నాలుగు జిల్లాలను ఎన్నిక చేసి—మొత్తంమీద 400 గ్రామాలను మాత్రమే ఒక్కొక్క రాష్ట్రంలో ఎన్నికచేసి టెలివిజన్ సెట్లులను గ్రామ పాఠశాలలందు ఏర్పాటు చేశారు. విద్యుచ్ఛక్తి సరఫరా గల గ్రామాలనే ఎన్నిక చేయడం జరిగింది.

---

శ్రీ టి. రామచంద్రరావు

---

ఆంధ్రప్రదేశ్‌లో హైద్రాబాదు (150 గ్రామాలు): మెదక్ (67 గ్రామాలు); మహబూబ్‌నగరు (98 గ్రామాలు); కర్నూలు (91 గ్రామాలు) జిల్లాలలో మొత్తం 406 గ్రామాలు ఎన్నికచేయబడి "చిత్రవాణి" ప్రదర్శనకు ఏర్పాట్లు చేయబడ్డాయి.

## సెట్టుల అజమాయిషీ

ఇండియన్ స్పేస్ రీసర్చి ఆర్గనైజేషను వారు-గ్రామాలలో ఏర్పాటు చేసిన 'సెట్టు'ల బాగోగులను చూచుకుంటా వుంటారు. ఏ కారణంచేతనయినా సెట్టు పనిచేయకపోతే దానిని సరిచూచి, బాగుచేసి మళ్ళీ పని చేయించేందుకు 'సర్వీసు' సెంటర్లను నెలకొల్పారు. 'మెకానిక్'లు జీపులమీద సంచారంచేస్తూ అడపాతడపా ఈ సెట్టులను తనిఖీ చేస్తూ వుంటారు. పోతే ప్రతిరోజూ ఈ 'సెట్టు'ను పనిచేయించడం, దానిని భద్రంగా చూచుకొనే బాధ్యతలను ఆ గ్రామ పాఠశాలకు చెందిన ఉపాధ్యాయునికి అప్పగించారు. నెలకు 15 రూపాయలు ఇందుకు గాను పారితోషికంగా యిస్తారు (సెట్టు చెడిపోతే సర్వీసు సెంటరుకు రిపోర్టుచేసి బాగుచేయించగలడు కూడా).

## కార్యక్రమాలను రూపొందించే దెవరు?

ఉదయంపూట ప్రసారమయ్యే విద్యార్థుల కవసరమైన కార్యక్రమాలను–కేంద్ర, రాష్ట్ర విద్యాశాఖల సాయంతోను; సాయంకాలం ప్రసారమయ్యే గ్రామస్థుల కార్యక్రమాలను—వ్యవసాయం, పశుపోషణ

(తరువాయి 41 వ పుటలో)



# రాజధాని విశేషాలు

—శ్రీ తిరుమల రామచంద్ర

## ముఖ్యమంత్రి హెచ్చరిక

ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు జులై 3, 4 తేదీలలో జరిగిన జిల్లా విద్యాశాఖాధికారుల మహా సభకు ప్రారంభోత్సవము జరుపుతూ, విద్యా సంస్థలు సక్రమంగా నడిచేట్టు చూడడం విద్యాశాఖాధికారుల విధ్యుక్తధర్మమని అన్నారు. "విద్యార్థులలోను, ఉపాధ్యాయులలోను నానాటికి క్రమ శిక్షణా రాహిత్యం చెలరేగి విద్యాసంస్థల వాతావరణాన్ని కలుషితం చేస్తున్నది. ఈ క్రమశిక్షణా రాహిత్యం ముఖ్యంగా విద్యార్థుల సంఘాల, ఉపాధ్యాయ సంఘాల ఎన్నికల సందర్భంలోను, ఉపాధ్యాయ ప్రతినిధులు శాసన నిర్మాణ సంస్థలకు ఎన్నికయేప్పుడు మితి మీరుతున్నది. కనుక రాష్ట్ర ప్రభుత్వం ఈ ఎన్నికలను నిషేధించడానికి సంకోచించదు." అని ముఖ్యమంత్రి హెచ్చరించారు. అధ్యక్షత వహించిన విద్యాశాఖామంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావు తమ ప్రసంగంలో జిల్లా విద్యాశాఖాధికారులు పాఠశాలల, కళాశాలల సక్రమ నిర్వహణను బాధ్యతతో చూడాలన్నారు.

## చేనేత వస్త్రాల విస్తరణ పథకం

చేనేత వస్త్రోత్పత్తి శాఖామాత్యులు శ్రీ కె. వి. కేశవులు జులై 3వ తేదీన పత్రికా ప్రతినిధులతో ముచ్చటిస్తూ, రాష్ట్ర ప్రభుత్వం 1975-76 సంవత్సరంలో చేనేత వస్త్రాల అభివృద్ధికి ఎనిమిది కోట్ల రూపాయల వ్యయంతో వివిధ పథకాలను అమలు పరుస్తుందన్నారు. ఈ పథకాలు ప్రధాని ప్రకటించిన వింశతిసూత్ర పథకానుగుణంగా రూపొందించ బడినవనీ, ఈ ఎనిమిది కోట్ల మొత్తం ఇదివరకు కేటాయించబడిన మొత్తాలకన్న అదనమన్నారు. ఆయన జులై 24న పత్రికా ప్రతినిధులతో ముచ్చటిస్తూ, "దేశంలో 35 లక్షల చేనేత మగ్గాలున్నవి వీటివల్ల దేశానికి అవసరమైన గుడ్డలో 40 శాతం వుత్పత్తి అవుతున్నది. ఆంధ్రప్రదేశ్‌లో ఆరు లక్షల మగ్గాలున్నవి. వీటి వుత్పత్తి ఇనుమడింప జేయబడుతుంది. మన రాష్ట్రంలో దాదాపు 10 వేల మర మగ్గాలున్నవి వాటిలో 2500 మాత్రమే పని చేస్తున్నవి. మర మగ్గాల సమాఖ్య పని లేని 5000 మర మగ్గాలను తీసుకొని పని సాగిస్తుంది" అన్నారు. పట్టునేతలో స్వల్పకాలిక శిక్షణ, మరమగ్గాల యంత్రాల వుత్పత్తికి సంస్థలు నెలకొల్పబడుతా యన్నారు

## త్వరలో నాలుగు నృత్య సంగీత కళాశాలలు

ఖమ్మం, మహబూబ్‌నగర్, కాకినాడ, నెల్లూరు పట్టణాలలో చెరి ఒక నృత్య సంగీత కళాశాల నెలకొల్పబడే విషయం ఆలోచనలో ఉన్నదని సంఘ సంక్షేమ సాంకేతిక విద్యాశాఖా మాత్యులు శ్రీ భాట్టం శ్రీరామమూర్తి తెలిపారు జులై రెండవవారంలో జరిగిన నృత్య సంగీత కళాశాలల ప్రిన్సిపాలుల సమావేశం అధ్యక్షనపై ఈ విషయం ఆలోచనలో వున్నదని ఆయన అన్నారు ప్రస్తుతం రాష్ట్రంలో ఎనిమిది సంగీత నృత్య పాఠశాలలు, కళాశాలలు వున్నాయి. ప్రజలలో కళాత్మక శక్తిని ప్రోత్సహించడానికి బహుమతులు కూడా ఇవ్వబడతాయని ఆయన అన్నారు.

## ఆధునిక తెలుగు సాహిత్యంలో మహిళా స్వాతంత్ర్యం

క్రిస్టియన్ లిటిరరీ సొసైటీ పక్షాన శ్రీ దాస్‌బాబు జూలై 12, 13తేదీలలో "ఆధునిక తెలుగు సాహిత్యంలో మహిళా స్వాతంత్ర్యోద్యమం" అనే విషయమై ఏర్పాటుచేసిన గోష్ఠిలో పలువురు ప్రముఖులు ఆలోచనాత్మకమైన వ్యాసాలు చదివారు. శ్రీమతి ఎలియా పీటర్ అధ్యక్షత వహించారు. ఆర్థిక సమానత్వం లేనిదే స్త్రీకి స్వాతంత్ర్యంలేదని కుమారి వాసిరెడ్డి సీతాదేవి, స్త్రీ విమోచనోద్యమం గురించి డాక్టర్ కొలకలూరి ఇనాక్. పాశ్చాత్యుల పద్ధతులలో మంచినిమాత్రమే స్వీకరించాలని రెవరెండు వేరువాజార్జ్, బైబిలులో స్త్రీలను గురించి పి. శకుంతల, సాహిత్యంలో ఉద్యోగినులను గురించి డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు. రచయిత్రులను గురించి శ్రీ కె. జి. కృష్ణమూర్తి, నవలల్లో స్త్రీలనుగురించి శ్రీమతి సి. ఆనందారామం, కథానికలలో స్త్రీలను గురించి శ్రీ మాదిరెడ్డి సులోచన. కెనడాలోని స్త్రీలకన్నా భారతీయ మహిళల పరిస్థితి మెరుగని కెనడా మహిళ శ్రీమతి కార్నెర్ ప్రసంగించారు

## ఉపాధ్యాయ సంక్షేమ నిధి

ఉపాధ్యాయుల బాగుకోసం కోటి రూపాయలనిధి సేకరించాలని ఉపాధ్యాయ సంక్షేమ సంఘం జులై 18 వ తేదీన విద్యామంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు అధ్యక్షతన సమావేశమై నిర్ణయించింది. విద్యామంత్రి ఈ సందర్భంలో ప్రసంగిస్తూ, ఈ సంవత్సరం ఉపాధ్యాయదినం సెప్టెంబరు 5 వ తేదీన పెద్ద యెత్తున జరుపబడుతుందని, దాదాపు 600 మంది ఉపాధ్యాయులకు బహుమతులు ఇవ్వబడుతాయని అన్నారు.

## ముఖ్యమంత్రి మార్గదర్శకత్వం

ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు కాంగ్రెస్‌వారిని రెండు నెలలలోగా తమ అదనపు భూమిని ప్రభుత్వానికి అప్పగించి భూమి సంస్కరణలు త్వరలో అమలు కావడానికి తోడ్పడాలని అభ్యర్థించి, ఉదాహరణప్రాయంగా తమ 60 యకరాల అదనపు భూమిని నష్ట పరిహారం లేకుండా ప్రభుత్వానికి అప్పగించివేశారు కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ ఈ విధంగానే కాంగ్రెస్‌వారిని జూలై 25న అభ్యర్థించింది

## పట్టు పరిశోధన సంస్థ

పట్టు పరిశ్రమకు సంబంధించిన వివిధ సమస్యల పరిష్కారానికి, పట్టు అభివృద్ధికిగాను పట్టు సాంకేతిక పరిశోధన సంస్థను నెలకొల్పాలని కేంద్ర పట్టు సంస్థ (సిల్క్ బోర్డ్) హైదరాబాద్‌లో 4, 5 తేదీలలో జరిపిన 46 వ వార్షికోత్సవ సమావేశంలో నిర్ణయించబడింది. ఈ విషయాన్ని సంస్థ అధ్యక్షుడు శ్రీ ఎస్. మునిరాజు తెలియజేశారు. జూలై 5 వ తేదీనాడు కేంద్ర పరిశ్రమ, పౌరసరఫరా శాఖ సహాయ మంత్రి శ్రీ ఎ. పి. శర్మ షాద్‌నగర్ వద్ద పట్టుపరిశ్రమ గోదాముకు శంకుస్థాపన చేశారు. ఈ ప్రాంతం వాతావరణం ఈ పట్టు పరిశ్రమ గోదాముకు అనుకూలమని ఆయన ప్రశంసించారు.

## "చెట్లు పెంచండి"

అటవీ శాఖామంత్రి శ్రీ ఇబ్రహీం అలీ అన్సారీ జూలై 8 వ తేదీన రక్షణ విషయిక పరిశోధన, అభివృద్ధి ప్రయోగశాల ఆవరణలో జరిగిన వనమహోత్సవంలో ప్రసంగిస్తూ, మొక్కలను కాపాడడం, కొత్తవాటిని నాటడం ప్రజల కర్తవ్యమని ఉద్బోధించారు. వనమహోత్సవం ఉత్సవం కావడానికి మారు ఏటా జరిగే ఏదో కర్మకాండ వంటిది కావడం విచారకరమన్నారు. ప్రజలు ఏ మంత్రినో, అధికారినో పిలిపించి మొక్కలు నాటించడం కేవలం ప్రచారం వంటిదికాక, ప్రజలు నిజంగా, హృదయ పూర్వకంగా చెట్లు పెంచాలని ఆయన అభ్యర్థించారు.

## గవర్నర్ అభ్యర్థన

గవర్నర్ శ్రీ ఓబుల్‌రెడ్డి జూలై 8 వ తేదీన అనీసుల్ ఘుర్బా అనాథాశ్రమాన్ని సందర్శించారు. దాని భవనం జీర్ణావస్థలో వుండడం పరికించి, 54 సంవత్సరాలుగా వున్న ఈ సంస్థ పునరుజ్జీవంతో సేవచేయడానికి ప్రజలు ఆదుకోవాలని అభ్యర్థించారు. ప్రభుత్వమూ, ప్రజలూ, సంఘసేవా సంస్థలు ఈ అనాథశరణాలయంలోని అనాథ బాలబాలికల బాధ్యత స్వీకరించడం అవసరమన్నారు. ప్రభుత్వ విచక్షణ సహాయనిధి నుంచి గవర్నర్ అనాథాలయానికి ఐదువేల రూపాయలు విరాళమిచ్చారు. హైదరాబాద్ రోటరీ క్లబ్బు పక్షాన రెండు కుట్టుమిషనులు, వంటపాత్రలు, కంచాలు మొదలైనవి బహూకరించారు.

## విద్యుత్సౌధ కవితా గోష్ఠి

జూలై 7 వ తేదీన విద్యుత్సౌధ ఉద్యోగుల విద్యుత్కళా సమితివారు అంతర్జాతీయ మహిళా సంవత్సరం సందర్భంగా ఏర్పాటు చేసిన మహిళా కవితా గోష్ఠికి అధ్యక్షత వహించిన డాక్టర్ నాయని కృష్ణకుమారి వచన కవిత చెప్పడం సులభంకాదని, ఏకవితకైనా ప్రాణం భావ గాంభీర్యమని, వచన కవిత కత్తిమీద సామువంటిదని అంటూ, అగ్నిపుత్రి, నేను–సముద్రం అనే వచన కవితా ఖండికలు చదివారు. శ్రీమతులు పరిమళా సోమేశ్వర్, శారదా అశోకవర్ధన్, పండా శమంతకమణి, రాణీ కమలాదేవి, ఆచంట రుక్మిణి, టి. విజయలక్ష్మి మున్నగువారు ఈ కవితా గోష్ఠిలో పాల్గొన్నారు. శ్రీ మర్ల అప్పారావు స్వాగత వచనాలతో ప్రారంభమైన గోష్ఠి, శ్రీ ఉమాపతి ధన్యవాదాలతో సమాప్తమైంది.



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు హైదరాబాద్ ఆంధ్ర సారస్వత పరిషత్తు హాలులో జూలై 31న ప్రముఖ కవి దాశరథిని సన్మానించారు. దాశరథి "ఆలోచనాలోచనాలు" కావ్యాన్ని ముఖ్యమంత్రి ఆవిష్కరించి కృతి స్వీకరించారు. ఈ సందర్భంగా జరిగినసభకు విద్య, సాంస్కృతిక శాఖ మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు అధ్యక్షత వహించారు.

# సంక్షిప్త తెలుగు సాహిత్య చరిత్ర

శ్రీ కె. ఆర్. కె. మోహన్

[ సాహిత్యం, దాని చరిత్ర— అంటే మన తెలుగు భాషలో మొదట్లో ఏమేమి పుస్తకాలు వచ్చాయి, తర్వాత ఏం వచ్చాయి, ఇప్పుడు ఏం వస్తున్నాయి, వీటిని ఎవరు రాస్తున్నారు?— ఇటువంటి విషయాలను వివరించే తులనాత్మక వ్యాసం ధారావాహికంగా వెలువరిస్తున్నాం.......సం. ]

"అరె మామయ్య వచ్చాడే!" అంటూ పిల్లలంతా కేరింతలు కొట్టడం మొదలు పెట్టారు

"మామయ్యా, నాకేం తెచ్చావ్?" అంటూ కాళ్ళకి అడ్డం పడ్డాడు ఆరేళ్ళ మధు.

"ఉండండిరా! కాకి గోలా మీరూను. మామయ్యని లోపల అడుగైనా తిన్నగా పెట్టనీయండి" అంటూ కోప్పడ్డాడు పన్నెండేళ్ళ రవి.

"హాయ్—అల్లాగేనా మామయ్య చేతిలో సంచి లాక్కోవడం!" అంటూ ఎనిమిదేళ్ళ వినుని కోప్పడింది మాధవి తన పెద్దరికం చూపిస్తూ. అవును—పద్నాలుగేళ్ళ మాధవి వారందరిలోనూ పెద్దదే

"ఏమిట్రా ఎవరొచ్చారు?" అంటూ వంటింట్లోంచి చెయ్యి తుడుచుకుంటూ బయటకు వచ్చింది అమ్మ.

"ప్రసాదం మామయ్య వచ్చాడమ్మా" అని చెప్పింది మాధవి.

"ఎప్పుడొచ్చావురా?" అంటూ అడిగింది అమ్మ.

"ఇప్పుడేనే— వీళ్ళ గోల నీకు వినిపించడం లేదూ?" అంటూ కుర్చీలో కూర్చున్నాడు ప్రసాద్.

"ఏమిటి విశేషం? ఏమైనా సభలున్నాయా?" అని అడిగింది రమణమ్మ నవ్వుతూ.

"ఏం సభలుంటేనే కాని రా కూడదా?" అంటూ సంచీ తెరిచాడు ప్రసాదం మామయ్య. "ఒరేయ్ రవీ, ఈ బిస్కట్లు అందరికీ పెట్టరా" అంటూ ఒక బిస్కట్ల పేకేట్ వాడి చేతికి ఇచ్చాడు. "ఒసేయ్ మాధవీ ఈ చాక్లెట్లు అందరికీ పంచవే" అంటూ మరొక ప్యాకెట్ దాని చేతికి ఇచ్చాడు.

"ఎప్పుడొచ్చినా ఇలా బిస్కట్లు, చాక్లెట్లూ తెస్తుంటావు కనుకనే. నీవు రాగానే, బెల్లం మీద ఈగలు ముసిరినట్లు నీ చుట్టూ మూగుతారు పిల్లలు" అంది రమణమ్మ నవ్వుతూ.

"నీకు కూడా తెచ్చాను లేవే. బాధ పడక...ఇదుగో నీ కోసం బందరు లడ్డులు...చేగోడీలూ" అంటూ చేతి సంచీలోంచి రెండు పొట్లాలు తీసి చెల్లెలి చేతికిచ్చాడు ప్రసాద్.

"బాగుంది వరుస..." అంటూ అవి తీసుకుంది రమణమ్మ.

"ఆ...అనుకుంటూనే ఉన్నాను... వచ్చావూ...ఎప్పుడు రావడం? ...ఆరే...అందరికీ క్రిస్మస్ తాతలాగా మిఠాయిలు పంచి పెడ్తున్నావ్...మరి నేనేనా పాపం చేసుకున్నది" అంటూ ప్రవేశించాడు భాస్కర్రావు అప్పుడే ఆఫీసు నుంచి వస్తూ.

"ఉందిలే బావా నీక్కూడా... తేకుంటే ఇంట్లో ఉండనిస్తావా నన్ను. ఇదిగో నీ కోసం నల్ల హల్వా" అంటూ సంచిలోంచి మరొక పొట్లం తీశాడు ప్రసాద్.

"ఏమిటయ్యా...బందరు మిఠాయి అంతా మా ఇంటికే తెచ్చేసి నట్లున్నావు?" అన్నాడు భాస్కరరావు నవ్వుతూ.

"ఇక్కడి బందరు మూకకి ఇద్దామని" అన్నాడు మామయ్య పిల్లల వంక చూసి నవ్వుతూ.

పిల్లలంతా గొల్లుమని నవ్వారు.

"పో మామయ్యా...మేమేమీ కోతులం కాదు" అంది విమల బుంగమూతి పెట్టుకొని.

"మీరే కాదు తల్లీ...మీరూ, మేమూ, అందరం కూడా వాటిలోంచి వచ్చిన వాళ్ళమే." అన్నాడు ప్రసాద్.

"బాగున్నాయి సరసాలు మీ హాస్యాలు వింటూ కూర్చుంటే నా పని అయినట్లే. మీరిల్లాగే మాట్లాడు తుంటూ కూర్చోండి, నేను లోపలకి పోయి కాఫీ తీసుకు వస్తా" అంటూ వంటింట్లోకి వెళ్ళి పోయింది రమణమ్మ.

"ఏం బావా...ఆరున్నర కాకుండానే ఆఫీసు నుంచి ఇంటి కొచ్చేశావు. ఏమిటి వ్వాళ క్లబ్బు కాని, పార్కు కాని లేవా ఏమిటి?" అన్నాడు ప్రసాద్ హాస్యంగా.

"అవెందుకుండవ్! మనం లేకున్నా అవి బాగానే ఉంటాయి. నువ్వొస్తావనే పెందరాళే వచ్చేశాను" అన్నాడు భాస్కరరావు.

"అబ్బా, రాత్రి ఏమన్నా కల వచ్చిందా ఏమిటి నేను వస్తున్నానని" అన్నాడు ప్రసాద్ నవ్వుతూ.

"అయ్యోరామ కలేం ఖర్మ. పేపర్లో పడిందిగా! అన్నాడు భాస్కరరావు!"

"నిజంగా?" అన్నాడు ప్రసాద్ ఆశ్చర్యంగా.

"అవునయ్యా. రేపటినుంచీ ఈ ఊరిలో అఖిల భారత తెలుగు రచయితల మహాసభలు ప్రారంభమవుతున్నాయి కదా. సాహిత్యసభలున్న చోట ప్రసాదం బావ ప్రత్యక్షం కాకుండా ఉంటాడా!" అన్నాడు భాస్కరరావు నవ్వుతూ.

"అల్లాచెప్పు......ఈమధ్య నీకు కూడా సాహిత్యం అంటే ఆసక్తి కలిగినట్లుందే!" అన్నాడు ప్రసాద్.

"ఇదుగో కాఫీ......తీసుకుంటూ కబుర్లాడు కోండి" అంటూ ట్రేలో కాఫీ తీసుకువచ్చింది రమణమ్మ.

కాఫీ వారి ముందు పెట్టి "ఒరేయి పిల్లలూ ఇంక మీరు అవతలకి పొండి. మామయ్య, నాన్నగారూ మాట్లాడుకుంటారు" అని కేకేసింది అమ్మ.

"బందరు మామయ్య బలే మంచివాడు కదా!" అంటూ విమలా, మధూ గుసగుసలాడుకున్నారు.

"మామయ్య జిందాబాద్. బందరు మిఠాయి జిందాబాద్" అంటూ పిల్లలంతా ఉత్సాహంగా బయటికి వెళ్ళి పోయారు.

## 2

"బావా, సభలకు వెళ్ళివస్తాను." అన్నాడు ప్రసాదం మామయ్య ప్రొద్దున్నే ఏడుగంటలకు.

"ఈ పూట నీవు మాట్లాడేదేమైనా ఉందా?" అన్నాడు భాస్కరరావు.

"ప్రొద్దున లేదు. సాయంత్రం నాలుగు గంటలకు ఉంది" అన్నాడు ప్రసాద్.

"ఏం విషయం గురించి మామయ్యా?" అంది మాధవి.

"తెలుగు సాహిత్య చరిత్ర గురించమ్మా" అన్నాడు.

"సావిత్రం అంటే ఏమిటి మామయ్యా!" అంది విమల. విమల మాటలకు అంతా ఫక్కున నవ్వారు.

విమల సిగ్గుపడి బుంగమూతి పెట్టింది.

"సావిత్రం కాదమ్మా......సాహిత్యం దానిచరిత్ర అనన్న మాట. అంటే మన తెలుగు భాషలో మొదటో ఏమేమి పుస్తకాలు వచ్చాయి? తర్వాత ఏమివచ్చాయి? ఇప్పుడు ఏమివస్తున్నాయి? వాట్ని ఎవరు వ్రాశారు?—ఇటువంటి విషయాలని గురించి తెలిపే చరిత్ర అన్నమాట" అన్నాడు ప్రసాదం మామయ్య.

"అయితే అది వినడానికి మేముకూడా వస్తాం మామయ్యా." అన్నాడు రవి.

"కుర్రసన్నాసుల్లారా.....మీకేం అర్థమవుతుందిరా. అక్కడ నేను మాట్లాడేది గట్టిగా గంటసేపు ఉండదు. వెయ్యి సంవత్సరాల పై బడ్డ మన సాహిత్యపు చరిత్ర చెప్పాలంటే మాటలా?" అన్నాడు మామయ్య.

"ఎల్లాగైనా నాకు వినాలని చాలా కోరికగా ఉంది మామయ్యా" అన్నాడు రవి.

"అవును మామయ్యా నాకూను" అంది మాధవి.

"అవును మామయ్యా నాకూను." అన్నాడు మధు ముద్దు ముద్దుగా.

"ఓరి భడవా......నీకూ్కడానా!" అంటూ మధు బుగ్గ గిల్లాడు మామయ్య. "సరేనర్రా...రాత్రి భోజనాలు అయ్యాక చెప్తాను." అంటూ లేచాడు ప్రసాదం మామయ్య.

"మధ్యాహ్నం భోజనానికి ఎన్నింటికి వస్తావోయి?" అని అడిగాడు భాస్కరరావు.

"నాకోసం కూర్చోకండి. భోజనాలన్నీ వాళ్ళే ఏర్పాట్లు చేస్తున్నారు." అన్నాడు ప్రసాద్.

"అదేం మొహమాటంరా. తిన్నగా వచ్చేయి" అంది రమణమ్మ, తమ్ముడితో.

"మొహమాటం ఏమిటీ నా మొహం. ఉన్నమాట చెప్తుంటేనూ. భోజనం కోసం రావాలంటే ఈ ఊరిబస్సులలో మీటింగులకి నేను వెళ్ళినట్లే." అంటూ చెప్పులు వేసుకున్నాడు ప్రసాదం మామయ్య.

"సరేవెళ్ళిరావోయి. వీలుంటే నేనుకూడా నీ మీటింగుకి వస్తాను." అన్నాడు భాస్కరరావు.

"మంచిది" అంటూ సెలవు తీసుకున్నాడు ప్రసాద్.

(సశేషం)

# తెలుగునాట సాంఘికోద్యమాలు

శ్రీ జె. వీరాస్వామి

గత నూటయాభై సంవత్సరాల భారతదేశ చరిత్రలో ప్రధానంగా మూడు ఉద్యమాలు కనపడతాయి. మొదటిది సంఘ సంస్కరణోద్యమము. ఆటుతరువాతది సాంస్కృతికోద్యమము. చివరిది స్వాతంత్ర్యోద్యమము.

ఆధునిక భారతదేశంలో, సంఘ సంస్కరణోద్యమానికి మూలపురుషుడు, రాజరామ్మోహనరాయలు. క్రిందటిశతాబ్దపు ప్రథమ పాదంలో, ఆయన సాంఘిక దురాచారాలతో హోరాహోరి పోరాడారు. సతీ సహగమనం రూపుమాపడం, స్త్రీ జనోద్ధరణము, బాహ్యమైన మతాచార కర్మకాండను నిరసించడం, ఆయన కృషి చేసి ఫలితం సాధించిన రంగాలు.

సనాతన సంప్రదాయాలను, మత దృక్పథాన్నీ, రామ్మోహనరాయలు, ఆయన అనుచరులు నిరసించి కొత్త విలువలను, కొత్త దృక్పథాలను, ప్రతిపాదించి ప్రచారం చేయడంతో సనాతన మతంలోని లోపాలను సంస్కరించి దానిని పునరుజ్జీవింపచేయాలనే ప్రత్యామ్నాయ ఉద్యమాలు కూడ బయలుదేరాయి. ఆర్యసమాజము, దివ్యజ్ఞాన సమాజము మొదలైన ఉద్యమాలు ఇటువంటివే. అంతేకాకుండా, గతమంతా దోషభూయిష్టమే, నిరాకరించి తోసివేయవలసిందేనన్న దృక్పథంపట్ల, తీవ్రమైన ఆందోళనతో, గతంలోని మంచిని, పూర్వవైభవాన్ని, వ్యాఖ్యానించి చూపటానికి, చారిత్రికావగాహనను కలిగించడానికి, సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమాలు కొన్ని బయలుదేరాయి. స్వాతంత్ర్యోద్యమానికి పూర్వరంగంగా, ఈ సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమాలు పనిచేశాయి. ఇంచుమించు ఈ శతాబ్ది మొదటి రెండు దశాబ్దాలు గడిచేదాకా, యీ పునరుజ్జీవనోద్యమ ప్రభావం కొనసాగింది.

తరువాత భారతదేశం అంతటా రాజకీయోద్యమం ప్రారంభమై, స్వాతంత్ర్య సంపాదనం వరకూ కొనసాగింది. ఇంచుమించుగా భారతదేశంలోని అన్ని ప్రాంతాలలోనూ, ఈ మూడు ఉద్యమాలూ, ఈ విధమైన క్రమంలో పనిచేశాయి.

తెలుగు దేశంలోకూడా ఉద్యమాలు ఈ వరసనే పనిచేశాయి. సంఘ సంస్కరణ సాధించాలన్న కోరికా, ఆ వాతావరణమూ, వీరేశలింగం పుట్టటానికి పూర్వమే తెలుగు దేశంలో కొద్దిగా కనిపించినా ఆయన నాయకత్వం వహించి నడిపిందాకా వేగము పుంజుకోలేదు. సంఘ సంస్కరణోద్యమ తీవ్రత తెలుగు దేశంలో వీరేశలింగంతోనే ప్రారంభమైందని చెప్పాలి.

## స్త్రీ విద్యా వ్యాప్తి

రాజారామ్మోహనరాయల వారి ప్రబోధం తెలుగు దేశంలోని మేధావులను కూడా, వీరేశలింగం ఉద్యమ నాయకత్వం వహించడానికి పూర్వమే, ప్రభావితం చేసిందనడానికి నిదర్శనాలున్నాయి. స్త్రీ విద్యపట్ల, స్త్రీ పునర్వివాహాలపట్ల, కులవ్యవస్థా నిర్మూలనంపట్ల కొందరు పెద్దలు ఆసక్తితో కృషిచేశారు ఏనుగుల వీరాస్వామి, కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లె మొదలైన మహనీయులు స్త్రీ విద్యా వ్యాప్తికై పాటుపడ్డారు. ఆ రోజుల్లోనే కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లె బాలికావిద్యాలయానికిగాను డెబ్భై వేల రూపాయలు విరాళమివ్వటం గొప్ప విషయము. గాజుల లక్ష్మీనర్సు చెట్టి అనే మహనీయుడు, వెట్టి చాకిరివంటి క్రూరమైన పద్ధతులను మాన్పడానికి కృషిచేశాడు కుడి ఎడమ కులాల తగాదాల విషయంగా కూడా, సామరస్యం కుదర్చడానికి ఆ రోజుల్లో మేధావులు కృషిచేశారు. దక్షిణ భారత దేశంలో రాజకీయ చైతన్యం విషయమై కృషిచేసిన మహనీయులలో గాజుల లక్ష్మీనర్సుచెట్టి ప్రథముడని చెప్పవచ్చు

దేశీయులలో ఉన్న అజ్ఞానాన్ని తొలగించాలనీ, అసమానతలు రూపుమాపాలనీ, సాంఘికాచారాలలోని లోపాలు సరిదిద్దాలనీ, చర్చా సంఘాలు, అంతరంగిక సమాజాలు స్థాపించుకొని, క్రిందటి శతాబ్దిపూర్వార్ధంలో కొందరు పెద్దలు కృషిచేశారు.

## హేతువాద దృక్పథం

1862వ సంవత్సరంలోనే సామినేని ముద్దునరసింహం అనే ఆయన హేతువాద దృక్పథంతో కూడిన భావివిప్లవోత్తేజకాలైన అభిప్రాయాలు ప్రకటించాడు. సాంఘిక దురాచారాలను, అంధవిశ్వాసాలను, మూఢ నమ్మకాలను దురన్యాయాలను ముద్దునరసింహంగారు తమ "హితసూచిని" అనే గ్రంథంలో ఖండించారు అతి బాల్య వివాహాలు, నిర్బంధ వైధవ్యం, వృద్ధ వివాహాలు కన్యాశుల్కం, అంటరానితనం, కులభేదాలు, శకునాలు, వేశ్యావృత్తి, మంత్రతంత్రాలపట్ల నమ్మకం, వివాహాలలో దుర్వ్యయాలు మొదలైనవన్నీ హేతువాద దృక్పథంతో పరిశీలించి దురాచారాలన్ని రూపుమాపవలసిందని ఆయన ఉద్బోధించారు. ఆధునిక కాలంలో సంఘ సంస్కరణోద్యమానికి పూర్వ రంగంలో జరిగిన కృషిలో ముద్దు నరసింహంగారిని తప్పక పేర్కొనాలి.

నెల్లూరు ప్రాంతంలో పుదూరి అనంతరామ శాస్త్రిగారనే వారు, హరిజనోద్ధరణం విషయంలో కృషిచేసి, అగ్రవర్ణాల వారి ఆగ్రహానికి కూడా గురిఅయినట్లు సాక్ష్యాధారాలున్నాయి. అంటరానితనం రూపుమాసిపోవాలనీ, కులభేదాలు నశించాలని ఈయన కృషిచేసినట్లు వినికిడి. పరవస్తు వెంకటరంగాచార్యుల వారు, విశాఖపట్టణ ప్రాంతంవారు. వీరు స్త్రీపునర్వివాహం శాస్త్రీయమే అంటూ ఆ రోజుల్లో ఒక కరపత్రం ప్రకటించారు. ఈయన చాలా

గొప్ప పండితుడు. మహామహోపాధ్యాయవంటి గొప్ప బిరుదులు పొందినవాడు. ఈశ్వరచంద్ర విద్యాసాగరులవంటి గొప్ప పండితులు వంగదేశంలో, స్త్రీ పునర్వివాహం శాస్త్ర సమ్మతమేనంటూ కొనసాగించిన ఉద్యమ ప్రభావం తెలుగు దేశంపైన కూడా ప్రసరించిందనటానికి కొన్ని నిదర్శనాలున్నాయి.

1872వ సంవత్సరంలో, వెలువడుతున్న తెలుగు పత్రికలలో, స్త్రీవిద్యను గురించి, స్త్రీ పునర్వివాహాన్ని గురించి, కొన్ని చర్చలు వెలువడ్డాయి మహారాష్ట్ర దేశంలోకూడా. ఇదే కాలంలో విష్ణుఘోషి మొదలైన వారు కొన్ని గ్రంథాలు వ్రాసి, కొంతకృషి చేశారు. అప్పటికే తెలుగు దేశంలో, బ్రహ్మసమాజంకూడా తన ప్రభావాన్ని ప్రసరింపజేసింది వేద సమాజమనే పేరుతో. మద్రాసునుంచి 'తత్త్వ బోధిని' అనే పత్రిక ద్వారా బ్రహ్మసమాజభావాల ప్రచారం కొనసాగేది.

## వీరేశలింగం కృషి

1848వ సంవత్సరంలో, వీరేశలింగం జన్మించాడు ఆయనకు ఇరవై నాలుగు. ఇరవై అయిదేళ్ళు వచ్చేసరికి చుట్టూవున్న సంఘంలోని దురాచారాలన్నీ అతి వికృత రూపంలో కనపడ్డాయి. ఇంగ్లీషు స్కూల్లో చేరి, ఐదు ఆరు తరగతులలో చదువుతున్న రోజులలోనే, పూర్వపు విశ్వాసాలన్ని మారిపోయి, హేతువాద దృక్పథం, ఆయనకు అలవడుతూ వచ్చింది. ఆ రోజుల్లో బ్రహ్మసమాజ ఆచార్యుడైన కేశవ చంద్రసేన్ బోధలు చదవటంవల్ల, విగ్రహారాధనపట్ల వైముఖ్యమూ, మంత్రతంత్రాల పట్లా, దయ్యాలు శకునాల పట్లా, అపనమ్మకమూ ఆయనలో ఏర్పడ్డాయి. వయసు వస్తున్న కొద్దీ, అయనలో సంఘాన్ని సంస్కరించాలన్న ఆకాంక్ష కూడా ఎక్కువవుతూ వచ్చింది. తమ ఇంట్లో అరటి చెట్టు మధ్య నుంచి, పువ్వు పుట్టి గెలవేసినా, దూలానికి తేనెపట్టు పట్టినా వాటికి శాంతులు, పూజలుఆయన చేయించలేదు దయ్యాలు పట్టినవాళ్ల ఇళ్లకు వెళ్లి, వారిప్రవర్తనలూ, భూతవైద్యుల ప్రవర్తనలూ నిశితంగా పరిశీలించి, అవన్నీ వొట్టి బూటకాలని ఆయన గ్రహించాడు. వీరేశలింగంగారి తల్లికి, గ్రహబాధను తప్పించటానికి ఒక భూతవైద్యుడు వచ్చి వీరేశలింగాన్నే దడిపించబోయి, తానే దడుసుకొని జబ్బు పడ్డాడు. ఇంతటితో ఆయనకు భూతప్రేతాల మీద నమ్మకం పూర్తిగాపోయింది అమావాస్యనాడు ఉద్యోగములో ప్రవేశించి, మూఢనమ్మకంత్రోసి పుచ్చాడు. ఆనాడు సంఘంలో ఎక్కువగా ఉన్న అతి బాల్యవివాహాలు, వృద్ధ వివాహాలు, న్యాయపరిపాలనలో జరుగుతున్న అన్యాయాలు, లంచగొండితనం, వేశ్యల పలుకుబడి, కన్యాశుల్కం మొదలైన వాటిని నిర్మూలించాలని ఆయన నడుంకట్టాడు.

## సాహిత్య ఆయుధం

సాహిత్యం, సంఘసంస్కరణానికి బలమైన ఆయుధంగా, ప్రధాన సాధనంగా పనికి వస్తుందని ఆయనకు తోచింది. ఇరవై ఆరేళ్ల వయసున, ఆయన 'వివేక వర్ధని' అనే పత్రికను ప్రారంభించి సంఘంలోని లోపాలన్నిటిని తీవ్రంగా విమర్శించటానికీ, హేళనాత్మకంగా ఎత్తి చూపటానికీ పూనుకొన్నాడు.

ఎన్నో ప్రహసనాలు వ్రాశాడు. సంఘంలో పలుకుబడి ఉన్న పెద్దమనుషుల దుశ్చర్యలన్నీ బట్టబయలు చేశాడు లంచాలు తీసుకొనే వాళ్ళను, వేశ్యలనాదరించే వాళ్ళను, తన పత్రికలో ఎత్తి చూపాడు. "వ్యవహార ధర్మ బోధిని" (ప్లీడరు నాటకం) "బ్రాహ్మ వివాహం", (పెద్దయ్యగారి పెండ్లి) అనే నాటకాలలో, ఆనాడు సంఘంలో ఉన్న దురాచారాలన్నిటినీ హేళన చేసి, ఆ దుర్మార్గాలకు స్థానమైన వాళ్ళందరూ సిగ్గుతో తలవంచుకొనేటట్లు చేశాడు. ప్రభుత్వోద్యోగులలోని లంచగొండితనం, వాళ్ళకు వేశ్యలతో సంబంధాలుండటం, వాళ్ళ అక్రమ ప్రవర్తనలు, వాళ్ళు భోగం మేళాలు ఏర్పాటు చేసి, సంఘంలోని వాళ్ళను బాధించడం, పీఠాధిపతుల అవినీతి, వాళ్ళ బలహీనతలు, మంత్ర తంత్ర వేత్తల బూకరింపులు, పండితుల కుతర్కాలు, మాయోపాయాలు, పెద్దమనుషులుగా చెలామణి ఆయ్యేవారి ద్రోహాలు, స్వార్థ బుద్ధి, అన్నీ తన రచనల ద్వారా లోకానికి వెల్లడించాడు. ప్రభుత్వాధికారి ఎంత బలవంతుడైనా, తన విరోధులు తన ప్రాణాలకే ముప్పు తలపెట్టినా, ఆయన జంకలేదు. వివేక వర్థనిలో, లంచాల కుట్రనొక దానిని బయట పెట్టినందువల్ల, ఆ రోజుల్లో, గవర్నమెంటు ప్లీడరు, జైలు తప్పించుకోవటానికిగాను, ఆత్మహత్య చేసుకోవాల్సి వచ్చింది. అవినీతికి లోబడిన డిస్ట్రిక్టు మున్సబు కూడా అకాల మరణం పాలుకావలసివచ్చింది. ఆ వ్యవహారమునకు సంబంధించిన, సిరస్తదారు, క్రిమినల్ రికార్డు కీపరూ, ఉద్యోగాలు పోగొట్టుకున్నారు. దేశీయులైనా, విదేశీయులైనా వారు ఎంతెంత పెద్ద పదవులలో వున్నా, లెక్క చేయకుండా, వీరేశలింగం తీవ్రంగా విమర్శించేవాడు. అన్నిటికన్నా, ముఖ్యంగా చెప్పుకోదగినది ఆయన సాధించిన "స్త్రీ పునర్వివాహం" 1881 వ సంవత్సరంలో తెలుగు దేశంలో మొట్టమొదటి సారిగా, ఆయన తన ఇంట్లోనే, వితంతు వివాహాన్ని నిర్వహించాడు. అటు తరువాత, జీవిత కాలంలో నలభైదాకా, రాజమండ్రి చెన్నపట్నం, బెంగుళూరు, బళ్ళారి, గుంటూరు, మొదలైన ప్రాంతాలలో ఆయన చేతి మీదుగా వితంతు వివాహాలెన్నో జరిపించాడు 1906 లో, కుల చిహ్నమైన జంధ్యం, విసర్జించి, సర్వ మానవ సమానత్వాన్ని చాటి చెప్పాడు. ఆ రోజుల్లో అంతటి విప్లవ కరమైన పని చేసి చూపడం, వీరేశలింగం గొప్పతనాన్ని చాటి చెపుతున్నది. తన యావదాస్తినీ హితకారిణీ సమాజం అనే సంస్థను స్థాపించి, ప్రజోపయోగకరమైన పనులను చేపట్టటానికి గాను దానికిచ్చివేశాడు. తెలుగు దేశంలోని చెడుగులను దిద్దటానికి పుట్టిన మహా పురుషుడు వీరేశలింగం. ఆయన ఒక వ్యక్తి మాత్రమే కాడు. ఒక గొప్ప సంస్థ. వీరేశలింగం ఒక గొప్ప ధర్మ యుద్ధాన్ని సాగించి, విజయం సాధించాడు. తెలుగు దేశంలో కిందటి శతాబ్ది ఉత్తరార్థంలో, వీరేశలింగం సాధించిన వివిధ ఉద్యమాల వల్ల, ప్రజలలో వినూత్నమైన సాంఘిక చైతన్యం, జాగృతి కలిగాయి. ఆయనకెందరో అనుచరులైనారు. విద్యార్థుల అండదండలు ఆయనకు సంపూర్ణంగా లభించాయి. సంఘమంతా ఆత్మవిమర్శ చేసుకొన్నది. చాలా సత్ఫలితాలు సాధించడం జరిగింది.

(తరువాయి నవంబరు సంచికలో)

నెల్లూరు జిల్లాలో....

# యానాదులు: వారి ఆచార వ్యవహారాలు

-శ్రీ పీరేపు ఆంజనేయులు

అనాదులు అనే మాట ఆనోట ఆనోట పడి యానాదులు క్రిందికి మారివుంటుంది. వీరు ఆంధ్రప్రదేశ్‌లో నెల్లూరు జిల్లాలో కొన్ని లక్షల మంది నివసిస్తున్నారు. వీరు సామాన్యంగా పెన్నా నది ఒడ్డున వుండే గ్రామాలలో నివసిస్తున్నారు. వీరిలో మంచి యానాదులు, కప్పల యానాదులు అని రెండు రకాల వాళ్ళున్నారు. వీళ్ళలో కప్పల యానాదులు చాలా మొరటుగా వుంటారు. ఒక గోచీ, దాని మీద నడుంకు ఒక గుడ్డ తప్ప ఇంకేమి ఆచ్ఛాదన వుండదు. ఆడువారికైతే ఒక చీరె, రవిక వుంటాయి. వీరికి ఒక చిన్న గుడిసె, ఒక పొడుగాటి గడ్డపార వంటి సాధనం. తాటి యాకులతో చేసిన బుట్ట ( చేపలు, ఎండ్రుకాయలు వేసుకొనేది )- ఇవే వీరి ఆస్తి. మహా వుంటే రెండు మట్టి కుండలు, ఒక చిన్న మట్టి పిడత వుంటాయి. వీరికి పాచిపని చేయడం, తోటలలో, పంట చేలలో పంట కుప్పలవద్ద కాపలా ఉండడం, వడ్లు దంచడం ముఖ్యవృత్తులు. వీళ్ళలో కొంతమంది ఈతాకుల చాపలు కూడా అల్లుతారు. వీరు ముఖ్యంగా చిట్టెలుకలను, పందికొక్కులను, ఉడుతలను పట్టి తింటుంటారు. ఇండ్లలో గోతులు చేసి, దాగియుండే పందికొక్కులను ఊదర పెట్టి పట్టడంలో వీరు నేర్పరులు. వీరు ఎక్కువగా ఎండ్రకాయలను గూడా తింటుంటారు. అందుకనే వీళ్ళలో ముసలివాళ్ళకైనా పండ్లూడటంగాని, వెంట్రుకలు తెల్లపడటంగాని మనకు అట్టే కనపడదు. వీళ్ళలో దొంగతనం, వ్యభిచారం సాధారణంగా కనపడవు. ఒకవేళ దొంగతనం చేసినా, ఆ రోజుకు అవసరమైనంత వరకే దొంగతనం చేస్తారు. అందుకనే అటువంటి చిన్న చిన్న దొంగతనాలు ఈ ప్రాంతంలో జరిగితే వాటిని యానదోళ్ళ దొంగతనం అంటూండడం వాడుక.

వీరికి ముఖ్యంగా తిరునాళ్ళ సమయాలలో, వెన్నెల రాత్రులలో పాటలు పాడుచూ దరువు వెయ్యడం సరదా. దీనినే యానాది చిందు అంటారు. ఆ సమయాలలో సినిమాలలో వుండే పాటలు ఆనవాయతీగా వస్తూండే పాటలు పాడుతుంటారు. ఈ పాటలను చప్పట్లతో, ఈలలతో, ఎక్కిరింతలతో, చేతులు వయ్యారంగా తిప్పుతూ, ఆడామగా కలిసి ఎగుర్తూ పాడ్తుంటే, జనం వింతగా చూస్తుంటారు.

ఆ నాడు కూటికుంటే కొమ్ములు తిరిగిన రెడ్డి వచ్చి పిలిచినా కిం, కం. అనకుండా గుడిసెలో పండుకుంటారుగాని, బైటికిరారు. ఏ పనిచేసినా, వారి వెంట వారి భార్యలు వుండ వలసిందే. వీళ్ళలో కొంతమంది సోదె చెప్తారు. ఆ సోదెచెప్పేవాళ్ళు ఆరోజంతా తన ఇలవేల్పుకు పస్తువుండి సోదెచెప్తారు. వీళ్ళు సామాన్యంగా జబ్బునపడడం మనం చూడం. అట్లా ఒకవేళ జబ్బున పడినా, సోదెద్వారా, ఆకుపసరులుద్వారా, చెట్టుమూలికల ద్వారా ఆ జబ్బును మాన్పుకుంటారు. అందుకే వీరిలో కొంతమంది చెట్టుమూలికలతో, ఆకుపసరులతో గ్రామాలలో వైద్యం చేస్తుంటారు. వీళ్ళలో ఎవరైనా మరణిస్తే ఎప్పుడు, ఏ సమయంలో, ఎక్కడ ఏవిధంగా పూడ్చి పెట్టారో, రెండోకంటికి తెలియకుండా చేస్తారు.

వీరు సామాన్యంగా దేశ ద్రిమ్మరులుకారు. అట్లా అని ఒక చోటు అట్టి పెట్టుకొని వుండరు. వారికి గుబులు మళ్ళినప్పుడు, ఒక పిట్టకి తెలియకుండా కుండ, చరవ, తీసికొని వేరే గ్రామాలకు పోతూండడం అలవాటు. అందుకనే ఎవరైనా అకస్మాత్తుగావూరు విడిచి వెళ్ళితే 'యానాదోళ్ళ గుడిసెమీద దెబ్బేసి పోయినట్లు' అని వాడుకగా అంటుంటారు.

వీరిదొక వింత జీవితం. నిరాడంబరులు, నిత్యసంతోషులు, నిష్కపటులు, నిష్కళంకులు, వీరిలోకమే వీరిది: అసలు వీరి లోకమే వేరు చీకూ, చింతా వీరిదగ్గరకు రానేరావు. ఈ నాటి సమాజంలో, క్షణక్షణానికి మారుతున్న మార్పులూ, జీవితంలోని మార్పులు, వీరినేమీ చేయవు. వీరికి వస్తువుల ధరలు మిన్నంటినాయని విచారమూవుండదు గుడ్డల ధరలు ఆకాశాన్నంటుతున్నాయని కించా వుండదు పండుగులకు కూతుళ్ళు అల్లుళ్ళూ వస్తారు, వారికి తగిన మర్యాదలు జరుపగలమో? లేమో? అనే ఆలోచనా వుండదు. పిల్లలకు చదువులకు ఫీజులుకట్టడం, వారికి పుస్తకాలు కొనడంలాంటి ఆలోచలూ వుండవు.... మానవుడు చంద్ర మండలంలో అడుగు పెట్టినాడంటే ఆశ్చర్యమూ పడరు ..., ప్రప్రథమంగా భారత మహిళ హిమాలయ పర్వతం అధిరోహించిందంటే సంతోషమూ వుండదు. అందుకనే వీరిదొక వింత జీవితం.

అట్లా అని వారిని అట్లే విడిగావుంచడం మంచిదికాదు. ప్రస్తుత ప్రజా ప్రభుత్వ విధానంలో భారతదేశాభ్యున్నతి ప్రతిపౌరుని భుజస్కంధములపై యున్నది. గనుక వారికి తగువసతులు కల్పించి, వారిని రాజకీయంగా, సాంఘికంగా మనతో సమానంగా తీసికొని రావలసిన విధి ప్రభుత్వముమీద వున్నది. వారికి, విద్య, వైద్య, వసతి సదుపాయములు చేయడం ప్రభుత్వపు విధి. కనుకనే ప్రభుత్వమువారు, వారికి ప్రత్యేకంగా సకల సదుపాయములు చేయు చున్నారు. నెల్లూరు జిల్లాకు సంబంధించిన పద్మవిభూషణ్ గౌ॥ శ్రీ వెన్నెలకంటి రాఘవయ్యగారి సేవలు ప్రశంసనీయము. ఇటీవల ప్రభుత్వము వారు బలవర్ధకాహారమును వీరి బిడ్డలకు అనగా 0-6 వయస్సులోపలి పిల్లలకు, గర్భిణీస్త్రీలకు, పురిటిస్త్రీలకు ఇచ్చే పథకమును అమలు పరచుచున్నారు. కాని వీరు సాంఘికంగా, రాజకీయంగా మనతో సమానం కావాలంటే కనీసం కొన్ని దశాబ్దాలు పట్టవచ్చు.

# సమైక్యాంధ్ర సందేశం

– శ్రీ యస్. టి. జ్ఞానానంద కవి

మ్రోయింపంబడె దిగ్దిగంతములలో పూర్వాంధ్రసామ్రాజ్య ల
క్ష్మీ యోగ్యప్రతిభాఢ్యకాహళులు, వెల్గెన్ శస్త్రివై దుష్య భా
షా యోషిన్మణి దీపికాశిఖతతుల్ క్ష్మామండలిన్ దొల్తనో
భాయీ! తెల్గుదనమ్ము లోకమున నింపన్నేడు లక్షింపుమీ!

హిమశైలమున "తెలంగము" తెల్గు బలశాలి
యుగ్రుడై చరణమ్ము నూనునాడు
బెదరిపోయిన మహావీరాంధ్రజాతిని
శ్రీముఖుండొకచోట జేర్చునాడు
కల్లోలమైన సంఘమును రక్షింపగా
శాతకర్ణి తలంపు సాగునాడు
ప్రజ్వరిల్లిన ప్రతాపజ్వాలలెగయ నాం
ధ్రులు పాటలీపురిన్ వెలయునాడు

ఏకతాభావమందలు యెదలయందు
ధ్యేయమై వెల్గి రాజ్యమ్ము నేలునాడు
ఆ యఖండసమైక్య భావానుభూతి
నిలుపుకోవలె నీనాడు తెలుగువాడ!

శౌలి జాతీయ మహోద్యమానకు మహాంధ్రుల్ కారణంబన్న యు
జ్జ్వల చారిత్రము నిల్పినట్టి తెలుగుల్ వైషమ్యభావాలతో
మెలగన్ గల్గునె? శాంతిసౌఖ్యకలనోన్మేషమ్ము విశ్వంభరా
స్థలిపై నింపు సమైక్యసుందర సమాధానమ్ము శాంతత్వమున్

ప్రకటించెముద్దార ప్రాకృతమ్మున మేటి
కవనమ్ము "హాలక" క్ష్మావిభుండు
చాటె బుద్ధుని యహింసా పంక్తులలరార
నవనీస్థలాన "నాగార్జునుండు"
మొగలాయి సార్వభౌముని మెప్పులందె ముం
గండ "జగన్నాథ" పండితుండు
ఉర్వి శ్లాఘింప నాయుర్వేద వైద్యాన
నసమకీర్తి నిగాంచె "బసవరాజు"

తెలుగుజాతి కీర్తిదీపాల వెలుగులు
పృథివినెల్ల నావరించుకొనియె
ఈ మహస్సునాటిదొ మహత్వమ్మును
నిలుపవలె తెలుంగు నేలయందు

ఝరులున్ వాహినులున్ నదమ్ములిడు స్వచ్ఛంబైన తోయాన బం
గరుపంటల్ ఫలియింప తిండికిట గ్రుక్కల్ మ్రింగి నీ దీన సో
దరులల్లాడుటగాంచి వారల మనోదైన్యమ్ము బో కార్పకు
న్నరహింపంగలవే? యథార్థముగనన్నా! దేశసౌభాగ్యముల్

పాషాణములకు జీవము బోసి చివురించి
చేవనందినది నీ శిల్పరచన
స్వర్గంపు రససిద్ధి సరిగాదు నాకంచు
పలికిపోయినది నీ తెలుగుకవిత
కమనీయచిత్రాలు ఘంటికాముఖమున
వెలువరించినది నీ తెలుగుకుంచె
కఠికిరాళ్లనునైన గరగించి గాంధర్వ
మున బేరువడసె నీ తెనుగుగీతి

ఖండఖండాంతరమున నఖండకీర్తి
తేజరిల్లి వర్ధిల్లె నీ తెలుగుతల్లి
కాని నీయనైక్యమ్ము కతాన మాసె
స్నిగ్ధరాగాలు మరల పండింపవోయి

మలినములేని మానసులు మంచికి వెంటనె సమ్మతించు ప్రో
జ్జ్వలగుణధాములీ ప్రకృతిసంపద దండిగ గల్గినట్టి తె
ల్గులకు గలట్టి దొక్కటియె లోపము సఖ్యములేకపోవుటన్
కులకలహాలమధ్యమున కొట్టుకపోవుట మానగావలెన్

తియ్యతియ్యనిదైన తెలుగువాగ్దేవత
పొలిమేరదాటంగ గలుగునాడు
అహమాహరింపగ విహారణంబొనరించు
కలువురక్కసి శిరమ్మొరగునాడు

పరమసంస్కృతి గల్గి నిలుపేద సత్కవీ
శ్వరునకాదరణమ్ము జరుగునాడు

ప్రతిలేనిదగు మహాపదవి నధిష్ఠించు
సచివోత్తమునిమాట సాగునాడు

తెలుగుదొరసాని యందాల కులుకుదనము
వేయిరేకుల విప్పారి విశ్వభువన
ప్రణతులందిన దినము రావలెను గాక
దివ్యదానందమానాడు తెలుగునాడు

ఐదుకోట్లాంధ్రజాతి యేకాత్మగాగ
మనినచో తెల్గుజాతి సంపద్విభూతి
దశదిశాంగణముల దాకు యశముగాంచు
తెలుగువారల ప్రతిభలు వెలుగునపుడు

అందింతువా హర్షమడరనాంధ్రులకు ని
ర్భరసమైక్య స్నేహభావ రసము

చిందింతువా ప్రజాక్షేమమ్ముకొఱకు నిం
డిన వేదనమున కన్నీటిజల్లు

సందింతువా తెల్గుజాతిలో జారిపో
యిన గౌరవంపుక్రొన్ననల చెలిమి

బంధింతువా తెల్గు భవితవ్యమునకు ద్రో
హము సేయ తలపెట్టు నల్పమతుల

కక్షరేగ కచ్చ గట్టిగా బిగియింప
జాలు వైమనస్య వర్గశక్తి
తెలుగువారియందు నిలువనీయగరాదు
కోరి పగలు పెంచుకొనగరాదు

తెలగాణాన వసించు తెల్గులును హంద్రీనిర్ఝరీ భాగ వా
సులునౌ రాయలసీమతెల్గులు, యశస్సుం గూర్చు సర్కారు సీ
మల వాసించిన తెల్గులందఱును సమ్యగ్దృష్టిమై జూడ తె
ల్గులె; వైరుధ్యములేల? నిండవలె వెల్గుల్ తెల్గుదేశమ్మునన్

నలిగిన జాతికెప్డు బహునాయకులున్ననథో జగత్తులో
నిలుచునుజాతి, దానికి కనీసము లేవెటువంటి భాగ్య రే
ఖలు, గలవేని శాశ్వతముగా రహియింపవు తెల్గుజాతి కు
జ్జ్వల భవితవ్యమున్నది నిజమ్మిది నాయకుడొక్కడైనచో

నిలిపింపవలె వియత్తలవీథి నీనాడు
సరసాంధ్ర మధురభాషా ధ్వజమ్ము

వెలిగింపవలె జగద్వలయాన నీనాడు
తెలుగుజాతి సమైక్య దీపకళిక

పలికింపవలె నల్దిశలు మెచ్చనీనాడు
వెలలేని యమృతంపు తెలుగుపలుకు

కలిగింపవలె తెలుంగులయందు నీనాడు
తులలేని పొందు పొత్తుల పసందు

వేడుకలర రెండువేలైదువందల
వత్సరాల తెలుగు వైభవమ్ము
జాటుకొన్నయట్టి సమయాన నీనాడు
తెలుగులకు శుభాలు కలుగుగాక !



# వెలుగులోకి

శ్రీ టి. ప్రకాశరావు

"చిన్న రైతుల అభివృద్ధి సంస్థ మాలాటి పేదోళ్ళకు పెద్ద దిక్కులా వుందండి చిన్న చిన్న రైతులకు, హరిజనులకు, గిరిజనులకూ యింకా సంఘంలోని యితర బలహీన వర్గాలవారికి చాలా సాయం చేస్తున్నదండి" అన్నాడు అరవై ఏళ్ళ హరిజన కర్షకుడు శ్రీ సింకా నారాయుడు. శ్రీకాకుళం జిల్లా తాళ్ళవలస గ్రామంలో వొళ్ళొంచి పనిచేసే పేదరైతు ఆయన. చిన్నరైతుల అభివృద్ధి సంస్థ తనకు చేసిన సహాయం వల్ల తన జీవితమే మారిపోయిందనీ, కష్టాలు గట్టెక్కి కాలం కలిసివచ్చిందనీ సంతోషంతో సంబరంగా చెప్పుకొన్నాడు. అలా చెప్తున్నప్పుడు అతని కళ్ళల్లో గతకాలపు నీలినీడలు కొద్దిసేపు కదిలి అంతలోనే కరిగిపోయాయి. తేలిగ్గా అతను ఊపిరితీసి విడిచాడు

సింకా నారాయుడి బాల్యం బాధలమయం. తిండికిలేక కుటుంబం తల్లడిల్లిపోతుంటే చూడలేక నారాయుడు, చిన్నప్పుడే ఇల్లువదిలి పారిపోయి సైన్యంలో చేరాడు. మూడేళ్ళ తరువాత రెండో ప్రపంచ యుద్ధం ముగియగానే నారాయుడి పని తీరిపోయింది. ఇంటికి తిరిగి వచ్చేయవలసి వచ్చింది. కడుపు నింపుకోడానికి కాయకష్టం తప్పనిసరైంది. కూలిపని చేసుకుంటూ కాలం వెళ్ళబుచ్చుతుండేవాడు.

పదేళ్ళ క్రిందటి మాట. అతని కష్టాలు తీరేరోజు వచ్చింది. ప్రభుత్వం అతనికి రెండెకరాల డెబ్భయి సెంట్ల బంజరు భూమి యిచ్చింది. దానిలో ఒక ఎకరాన్ని మెట్టసాగు చేశాడు. డెబ్భయిసెంట్లను పల్లపు సాగుక్రిందికి తెచ్చాడు. మిగిలిన ఎకరము అలాగే వుండిపోయింది. దాన్నికూడా సాగు చేసుకోడానికి అతని దగ్గర డబ్బులేదు. అటువంటి పరిస్థితుల్లో చిన్నరైతుల అభివృద్ధి సంస్థ అతన్ని ఆదుకుంది. వ్యవసాయం బాగుచేసుకోడానికి 4,000 రూపాయలకుపైగా అప్పు యిచ్చింది. ఆ అప్పు అతని పాలిటి వరం అయ్యింది.

దానిలో 2,000 రూపాయలుపెట్టి ఒక బావి త్రవ్వించాడు. మరో 1000 రూపాయలు ఖర్చుపెట్టి ఎలక్ట్రిక్ మోటారు పెట్టించాడు. 300 రూపాయలతో దానికొక షెడు వేయించాడు. 700 రూపాయలు ఖర్చుపెట్టి ఆ ఎకరం బంజరునీ సేద్యయోగ్యం చేసుకున్నాడు. తను కష్టపడి సంపాదించుకుని కూడబెట్టుకున్న కొద్దిపాటి డబ్బు కూడా పొలంమీద పెట్టాడు.

## ప్రదర్శన క్షేత్రం

నారాయుడి పొలం అతని వూరికి 2 ఫర్లాంగుల దూరంలోనే వుంది శ్రీకాకుళం, విశాఖపట్నం మధ్య జాతీయ రహదారి పక్కనే శ్రీకాకుళానికి 14 మైళ్ళదూరం యిది. అందువల్ల చిన్నరైతుల అభివృద్ధి సంస్థవారు యీయన పొలాన్ని ప్రదర్శన క్షేత్రంగా ఎన్నుకున్నారు. అలా ఆయన పొలంలో ప్రదర్శన క్షేత్రాన్ని ఏర్పాటు చేస్తున్నందుకు వారు నారాయుడికి వంద రూపాయలు యిచ్చారు. అంతేకాక సాంకేతికవేత్తల సలహా సంప్రదింపులు కూడా అతనికి లభించాయి. రకరకాల పంటల్ని పండించడానికి అతనికి అవకాశం లభించింది.

మే, జూన్ నెలల్లో కూడా నారాయుడు పొలంలో వంకాయలు, మిరపకాయలు, బొప్పాయి, ఉల్లిపాయలు వంటి పంటలు మనకు కనిపిస్తాయి. అతని పొలం గట్లమీద మొత్తం 180 తాటిచెట్లు, 71 కొబ్బరి చెట్లు వున్నాయి. చెరకు పండిస్తున్నాడు. అరటి మొక్కలు సరే సరి.

20 సెంట్లలో వరి, 60 సెంట్లలో రాగులు, 20 సెంట్లలో సంకరజొన్న పండిస్తున్నాడు. మరో ఎకరం సాగుక్రిందకు రావడంతో అతని ఆనందానికి అవధులు లేకపోయాయి. తాను తీసుకున్న ఋణం తాలూకు మొదటి వాయిదాను ఇటీవలే అతను చెల్లించేశాడు. తమ కాళ్ళమీద తాము నిలబడేందుకు తోడ్పడ్డ చిన్నరైతుల అభివృద్ధి సంస్థకు, ముఖ్యంగా ప్రభుత్వానికి తానూ, తన కుటుంబమూ ఎంతగానో ఋణపడివున్నామని నారాయుడు వినమ్రతా భావంతో, కృతజ్ఞతా పూర్వకంగా పేర్కొన్నాడు.

నారాయుడూ, అతని భార్యా ఏడాదిపొడుగునా కష్టపడి అన్ని ఋతువుల్లోనూ ఆయా కాలాల పంటలనేకం పండిస్తారు. అతని మేనల్లుడు కూడా వీరితోపాటు పనిచేస్తాడు. నారాయుడికి నలుగురు పిల్లలు ముగ్గురి పెళ్ళిళ్ళు చేశాడు. ఆఖరివాడు ఆరో తరగతి చదువుకుంటున్నాడు. రణస్థలంలో సాంఘిక సంక్షేమ శాఖవారి హాస్టలులో వుంటున్నాడు. పెద్ద కొడుకుని స్కూలు ఫైనల్ వరకు చదివించాడు. ఇప్పుడు అతను విశాఖలోని భారత్ హెవీ ప్లేట్స్ అండ్ వెసల్స్ కర్మాగారంలో పనిచేస్తున్నాడు. ఆడపిల్లలు యిద్దరి పెళ్ళిళ్ళూ చేసేశాడు గనుక అతనికి పెద్దబరువు తీరిపోయింది. నలుగురు మనమళ్ళు వున్నారు.

(తరువాయి 48వ పేజీలో)







## శ్రమజీవుల కృషి ఫలితం



ఈ గడ్డ రతనాల గడ్డ. నీళ్ళ
నేల తడిసి, విత్తు నాటితే సస్యశ్యామ
పంటలు కన్నులపండువు చేస్తాయి.

తాళ్ళవలసలో శ్రీ సింకా నారా
రైతు నీళ్ళు దున్ని బంగారం పండించాడ
కష్టజీవులే అన్నపూర్ణవంటి మన రా
ఘనతను చేకూర్చే భాగ్యదాతలు.

సీరియల్

# నిరాశలో నిండు గుండె

— సి. ఆనందారామం

**జరిగిన కథ :**

మిఠాయి కొట్టు మునలమ్మ పక్షంవహించి పోలీసును కొట్టాడన్న నేరంపై జైలు శిక్ష అనుభవించి వచ్చాడు అనాథకుర్రాడు.—వీళ్ళు వెళ్ళగొడితే వాళ్ళింట్లో, వాళ్ళు వెళ్ళ గొడితే వీళ్ళింట్లో; పైకి ఆకతాయిగా కనిపించినా అతడి మనసు అడుగు పొరల్లోని మానవత్వం సి. ఐ. డి. ఆఫీసర్ మోహన్‌ను ఆకట్టుకుంది. సమయం వచ్చినపుడు ఆ కుర్రాడికేదైనా పనియిస్తానని మాట యిచ్చాడు మోహన్. ఇక రెండవ అధ్యాయం చదవండి.................

## 2

"హోటల్ లోటస్" అని చక్కని ఇంగ్లీష్ అక్షరాలు అందంగాచెక్కి ఉన్నాయి. ఆ భవనం మీద చీకటి పడగానే విద్యుద్దీపాలు ఆ అక్షరాలను వెలిగిస్తాయి. ఆ పేరు పరిశీలనగా చూసి లోపలకు అడుగుపెట్టాడు మోహన్...రిసెప్షన్ హాలులోనే పద్మంలో ఉన్న లక్ష్మీదేవి పాలరాతి విగ్రహం ఉంది. జీవకళ ఉట్టిపడుతూ ఉంది. ఆ విగ్రహానికి పూజాపునస్కారాలు జరిగిన ఆనవాళ్ళున్నాయి. హోటల్ అంతా పాశ్చాత్య పద్ధతుల్లో నడుస్తున్నా, నడుపుతోన్నది మాత్రం అసలు సిసలైన ఆంధ్రులనటానికి ఆ విగ్రహమే సాక్ష్యం.

పరిసరాలన్నీ పరిశీలనగా చూస్తూ రెస్టారెంట్ సెక్షన్‌లోకి అడుగుపెట్టబోతున్న మోహన్ కాళ్ళకు సంకెళ్ళు వేసినట్లు ఆగిపోయాడు. మేనేజర్ రూమ్‌కి ప్రక్కనేఉన్న మరొక రూమ్ స్ప్రింగ్‌డోర్ తెరుచుకుని బయటకు వస్తోన్న ప్రసూన కూడా అంతే ఆశ్చర్యంతో ఆగిపోయింది.

"మీరు......" అన్నాడు మోహన్ ప్రసూనతోపాటు పరిసరాలను కూడా గమనిస్తూ...

"నాపేరు మరిచిపోయారా?" అంది ప్రసూన నవ్వి...

"లేదు, మరిచిపోలేదు. ఒకసారి తెలుసుకున్నాక మరిచిపోను. మిస్ సూన కదూ!"

"నాపేరు 'ప్రసూన!' నాదగ్గరి స్నేహితులంతా చనువుగా 'సూనా?' అంటారు. లోపలకు రండి..." అని తన గదిలోకి ఆహ్వానించింది...విశాలమైన టేబిల్ ముందు ప్రసూన కూర్చునే కుర్చీగాక మరి నాలుగు కుర్చీలున్నాయి. టేబిల్‌మీద టైప్ మిషన్ ఉంది...టెలిఫోన్ ఉంది...గది చాలా పరిశుభ్రంగా ఉంది. దృష్టి కొట్టకుండా అన్నట్లు ఒక మూలమాత్రం కుప్పగా కొన్ని పాత మేగజిన్లకట్టలు పడిఉన్నాయి. వాటిమీద మోహన్‌చూపులు కొన్ని క్షణాలు నిలిచాయి. ప్రసూన సంజాయిషీ ఇచ్చుకొంటున్నట్లు "అవి అక్కణ్నుంచి తీసెయ్యమని నేను ఎన్నోసార్లు చెప్పాను. కానీ సాంబశివంగారు వాటిని అక్కడే ఉండనియ్యమంటారు..." అంది.

"ఈ గదిలోకి సాధారణంగా ఎవ్వరూ రారనుకుంటాను" ఆలోచిస్తూ అన్నాడు మోహన్.

"రారు; నాతో సాంబశివంగారికి మాత్రమే పని ఉంటుంది"

"హలో సర్; నమస్తే!"

చేతిలో పేపర్‌తో ఆ గదిలోకి వచ్చిన చిరంజీవి నవ్వుతూ విష్‌చేశాడు.

మోహన్ తిరిగినవ్వి "నువ్వు ఇక్కడ పనిచేస్తున్నావా?" అన్నాడు.

"లేదుసార్; ఈ హోటల్ రూమ్స్‌లో ఉన్నవాళ్ళందరికీ పేపర్లందిస్తాను వస్తానుసార్..."

మెరుపులా వెళ్ళిపోయాడు.

"మీకేం కావాలో చెప్పండి తెప్పిస్తాను" అంది ప్రసూన.

"ఏమీ అక్కర్లేదు..."

"అయితే హోటల్‌కెందుకు వచ్చినట్లు?"

మోహన్ నవ్వి "ఊరికే. తెప్పిస్తానంటే మీ యిష్టం" అన్నాడు.

ప్రసూన స్వీటూ, హాటూ ఆర్డరిచ్చింది.

బాయ్ ప్లేట్లలో ఫలహారాలు తీసుకొచ్చాడు. ప్రసూన అవి స్వయంగా తను అందుకొని మోహన్ ముందు ఉంచింది...

"నన్ను క్షమించండి" అంది సిగ్గుపడుతూ...

స్వీట్ నోట్లో పెట్టుకోబోతున్న మోహన్ ఆశ్చర్యంగా "ఎందుకని?" అన్నాడు.

"నాకు తరువాత తెలిసింది. ఆ ఉత్తరం వ్రాసింది మా సుశీల..."

"అదా!" అని పకపక నవ్వాడు మోహన్...

మరింత సిగ్గుపడిపోయింది ప్రసూన...ఆ సంగతి ఎప్పుడు గుర్తువచ్చినా సిగ్గుతో చితికిపోతుంది ప్రసూన ...

కాలేజీలో హీరో వర్‌షిప్ ఎంజాయ్ చెయ్యగలిగిన కొద్ది మంది అదృష్టవంతులలో మోహన్ ఒకడు....అతడు మంచివక్త. కాలేజీలకు సంబంధించిన సభలలో....సమావేశాలలో అతడు ఉండక తప్పదు. మధ్య మధ్యలో నవ్విస్తూ...విషయాన్ని చక్కగా వివరిస్తూ అతడు...మాట్లాడుతూ ఉంటే అందరూ ముగ్ధులై వినేవారు.... లేడీస్ వెయిటింగ్ రూంలో అతని పేరు తరచు వినిపిస్తూ ఉండేది కానీ మిగిలిన మొగపిల్లల్లాగా మోహన్ లేడీస్టూడెంట్స్ అనుగ్రహం కోసం పాకులాడేవాడు కాదు. అసలు వాళ్ళని పట్టించుకునేవాడు కాదు. ఇది అతని ఆకర్షణను మరింత అధికంచేసింది...

ఒకరోజు ప్రసూనకు ఒక ఉత్తరం వచ్చింది. "డియర్ సూనా! నేను నిన్ను ప్రేమిస్తున్నాను. గాఢంగా...అతి గాఢంగా...మహా గాఢంగా...ప్రేమిస్తున్నాను....నన్ను కరుణించు....

నీ మోహన్..."

మిగిలిన చాలామంది ఆడపిల్లలతోపాటు ప్రసూనకు కూడా మోహన్‌పట్ల చాల గౌరవభావముంది. అప్పుడప్పుడు అతని గురించి కలలు కనటమూ, 'సిల్లీ' అని తనను తను మందలించుకోవటమూ కూడా జరిగింది... ఆ ఉత్తరం చూడగానే ప్రసూన తలక్రిందులయి పోయింది...మోహన్ ప్రేమలేఖ వ్రాశాడు... తనకు వ్రాశాడు...

వెంటనే సమాధానం వ్రాయటానికి కూచుంది. అంతలో ఆ ఆలోచన విరమించుకుంది. వెంటనే సమాధనమిస్తే లోకువ అయిపోతుందేమో! మోహన్ అలా లోకువ కట్టి ఏడిపించే మనిషిలాగ కనిపించడు...కానీ, ఎందుకైనా మంచిది. సమాధాన మియ్యకుండా అతనేం చేస్తాడో చూడాలి. మళ్ళీ ఉత్తరం వ్రాస్తాడా? తనను పలకరించి మాట్లాడతాడా?

ప్రతి క్షణమూ లెక్కపెట్టుకుంటూ నాలుగు రోజులు గడిపింది. అంతలో మరొక అనుమానం వచ్చింది. మోహన్ అందరి లాంటి వాడు కాడు. తను సమాధానం ఇయ్యకపోతే తనకు ఇష్టం లేదని అర్థంచేసుకుంటాడేమో! అలాగని సమాధాన మిస్తే... ఏమని రాయాలి? అంత కంటే ఇంటికి పిలిచి మాట్లాడితే బాగుంటుందేమో! ఈ ఆలోచన అన్నింటి కంటే బాగుంది.

ప్రసూనకు...తండ్రి హరి ఎప్పుడూ ఇంట్లో ఉండడు. ఒకవేళ ఇంటికెప్పుడైనా వచ్చినా అర్ధ రాత్రి తప్పతాగి వస్తాడు. తల్లి రాధమ్మకు సినిమాలంటే వొళ్ళు తెలీదు. ఏమ్యాటినీకో వెళ్ళమని పంపెయ్యచ్చు.

ఆ రోజే మోహన్‌ను కలుసుకుని "మీకు వీలయితే రేపొకసారి మాఇంటికి రాగలరా" అంది...

మోహన్ ఆశ్చర్యంగా "ఎందుకు?" అన్నాడు.
మనస్సు కలుక్కుమంది ప్రసూనకు. కొంచెంకోపం కూడా వచ్చింది.

"మీతో మాట్లాడాలి!" అంది కరుగ్గా...

"వస్తాను అడ్రసివ్వండి..."అన్నాడు...

"నా అడ్రస్ మీకు తెలియదా?"

"ఎలా తెలుస్తుందీ"

వేషాలు! బాగా బుద్ధిచెప్పాలి! ఇక్కడ కాదు—అడ్రస్ కాగితం మీద వ్రాసి ఇచ్చింది. జేబులో పెట్టుకున్నాడు.

"మరచి పోకండి"

"మరచిపోను! తప్పకుండా వస్తాను..."

ఆ మరునాడు తల్లి రాధమ్మను సినిమాకు పంపించటం ఏ మంత కష్టంకాలేదు ప్రసూనకు...

కొత్త సినిమా వచ్చిందనగానే ఏమిటి? ఎలా ఉందని కూడా అడక్కుండా తాగుతోన్న కాఫీ ఒక్కసారి గొంతులో పోసుకుని గబగబ బయలు దేరింది రాధమ్మ....

ఎటొచ్చీ ఎప్పుడంటే అప్పుడు ఊడిపడేది సుశీల ... సుశీల రాకుండా చూసుకోవాలి—వెంటనే ఫోన్ చేసింది.

"సుశీ! నేను అర్జంట్ పని మీద బయటకు వెళ్తున్నాను. మాఇంటికి రాకు."

"అలాగే! నీ అర్జంట్ పనులయ్యేవరకు రాను!"

సుశీల అడ్డ దిడ్డం ప్రశ్నలు వెయ్యకుండా అంతత్వరగా ఒప్పుకున్నందుకు చాలా సంతోషించింది ప్రసూన.

ఎంతో శ్రద్ధగా అలంకరించుకుంది. అన్నమాట తప్పకుండా వచ్చాడు మోహన్ ... ఆప్యాయంగా ఆహ్వానించింది. ఏవేవో ఫలహారాలు అతని ముందు పెట్టింది. ఫలహారంచేస్తూ "నన్నెందుకు రమ్మన్నారు?" అన్నాడు మోహన్ మామూలుగా...

అతని ధోరణి ప్రసూనకు ఇబ్బందిగాఉంది. నవ్వి "అంత మంది ఆడపిల్లల్లో మీరు నన్ను గుర్తుపెట్టుకుంటారని అనుకోలేదు." అంది...

మోహన్ తెల్లబోయి "నిన్న మీరు పలకరించే వరకూ మీరెవరో నాకు తెలీదు..." అన్నాడు.

ప్రసూన ఇంక భరించ లేక పోయింది.

"ఏయ్ మిష్టర్! ఆడ పిల్లలకు ప్రేమ లేఖలు వ్రాసి అల్లరి పెడదామనుకుంటున్నారా?" అంది...

"నేను...ఆడపిల్లలకు...ప్రేమ లేఖలు వ్రాస్తానా? ఎవరికి వ్రాశాను?..."

"ఎవరికో వ్రాస్తే నాకెందుకు? నాకు వ్రాయబట్టే నేను అడుగు తున్నాను......"

"మీకు ప్రేమ లేఖ వ్రాశానా? చూపించండి......"

ఎప్పుడూ తన బేగ్‌లో ఉంచుకునే ప్రేమలేఖ తీసి చూపించింది ప్రసూన...

దానిని చూసి ఫక్కున నవ్వాడు మోహన్...

"ఇది నేను రాయలేదు — కావాలంటే నా రైటింగ్ చూడండి. ... ..."

ఒక కాగితం తీసుకుని "డియర్ సునా ... ..." అని వ్రాసి చూపించాడు. ఆ దస్తూరికీ ఉత్తరంలో దస్తూరికి పోలిక లేదు...

ప్రసూన ముఖం వెలవెలబోయింది.

"అదీగాక నేను మాట్లాడుతోంటే వింటారు కదా నేను వ్రాస్తే ఇంత చప్పగా వ్రాస్తానా ?"

అవమానంతో తల క్రిందకు వాలిపోతోంది ప్రసూనకు ...

"ఇంతకూ మీరు నన్నెందుకు పిలిపించారు ? ఆ ప్రేమలేఖకు సమాధానం ఇయ్యడానికా ?"

మోహన్ కళ్ళలో కొంటె నవ్వు ... ... ప్రసూన మనసు మండిపోయింది. ఆ మంటలో రాబోయే కన్నీళ్ళు ఆవిరయి పోయాయి.

"కాదు ! ఇలాటి పోకిరీ పనులు చెయ్యకుండా బుద్ధి చెప్పటానికి ... ..."

"నేను నమ్మను ...అలా అయితే ఇంట్లో ఎవరూ లేకుండా చూసి పిలిచేవారు కాదు. ఇంత శ్రద్ధగా అలంకరించుకునే వారు కారు ... నాకీ ఫలహారం పెట్టేవారు కాదు ..."

ప్రసూన చటుక్కున మొహం తిప్పుకుంది. పైట కొంగులో ముఖం దాచుకుంది.

మోహన్ కొంటెతనం ఎగిరిపోయింది.

"ఐ యామ్ సారీ !" అన్నాడు.

ప్రసూన పైట కొంగులోనుండి ముఖం బయటకు తియ్యలేదు.

ఆ పైట చాటున ముఖం ఏం చేస్తుందో ఎగసి పడుతున్న వక్షస్థలం చెప్పుతోంది. ...

"ఇలా అయితే నేను వెళ్ళి పోవలసి వస్తుంది. ఇలా చూడండి. మామూలుగా నవ్వండి. ... ..."

"ఒక్క నిముషం. వెళ్ళకండి. ..." పైట చాటునుండే అని బాత్‌రూమ్‌లోకి పరుగెట్టింది ప్రసూన. వెంటనే బయటకు వచ్చింది. చెక్కిళ్ళూ, కళ్ళూ ఎఱ్ఱగా ఉన్నాయి. మామూలుగా నవ్వటానికి ప్రయత్నించింది.

మోహన్ కాలేజి విషయాలు అవి ఇవి చాలా మాట్లాడాడు—అతని మాటల్లో పడి మధ్య మధ్య ప్రసూన నవ్వేసింది.

ఒక్క అరగంట కూర్చుని "వెళతాను." అని లేచాడు మోహన్. ప్రసూన తల ఊపింది. ఉండమని అనలేదు. గుమ్మందాకా వెళ్ళిన మోహన్ ఒక్క క్షణం ఆగాడు. "నేను బీద వాణ్ణి—కష్టపడి చదువుకుంటున్న వాణ్ణి—ప్రేమించటంలాంటి హాబీలు నాకు లేవు........" అన్నాడు.

ప్రసూన మాట్లాడ లేదు. మోహన్ వెళ్ళిపోయాడు. అంత వరకూ అణచుకున్న దుఃఖం ఒక్కసారి పొంగివచ్చింది ప్రసూనకు

చేతులతో ముఖం కప్పుకుని ఏడుస్తోన్న ప్రసూన భుజంమీద చెయ్యి పడేసరికి ఉలిక్కిపడి సుశీలను చూసి కోపంగా "ఎందుకొచ్చావ్ ? రావద్దని చెప్పలేదూ ?" అంది.

"నీ అర్జెంటు పని అయ్యాకే వచ్చానుగా ! బస్ స్టాప్‌దగ్గర కారాపి మోహన్ వెళ్ళిపోయాకే వచ్చాను."

ప్రసూన కర్థమయి పోయింది సుశీల చేసిన పని!

ఆ తరువాత మోహన్‌ను కలుసుకోవాలానే కోరిక ఉన్నా కలుస్తాడనే ఆశలేకపోయింది ప్రసూనకు. ఫైనల్ ఇయర్ పూర్తి కావటంతో ఎక్కడివాళ్ళక్కడ విడిపోయారు...తరువాత ఇన్నాళ్ళకు మోహన్‌ను కలుసుకోవడం...సిగ్గునూ, సంకోచాన్నీ, సంతోషాన్నీ కూడా కలిగించింది ప్రసూనకు.

కాఫీ సిప్ చేస్తూ "సుశీల మీస్నేహితురాలా" అన్నాడు మోహన్...

"అవును సాంబశివంగార్కమ్మాయి...".

చురుగ్గా చూశాడు మోహన్....

"సాంబశివంగారు మీకు మొదటి నుంచి—అంటే ఈ పనిలో చేరకముందు నుంచి తెలుసా? ..."

"చాలా చిన్నప్పటినుంచి తెలుసు. ఆయనా మానాన్నగారూ మంచి స్నేహితులు........."

"మీనాన్నగారు ఏమి చేస్తుంటారు ?"

ప్రసూన తడబడింది "వ్యాపారం" అంది—ఇంకేమీ అడగలేదు మోహన్...

చీరకుచ్చెళ్ళు చెదరకుండా వయ్యారంగా లయగా నడుస్తూ "హలో మిస్ ప్రసూనా" అంటువచ్చిన రేఖ మోహన్‌ను చూసి ఆగిపోయింది...

"ఈవిడ రేఖ—ఇక్కడ డాన్సర్" అంటూ పరిచయం చేసింది ప్రసూన...

రేఖ చేతులు జోడిస్తూ మోహన్‌ను చూసి అదోకరకంగా నవ్వింది...మోహన్ తిరిగి నవ్విన నవ్వుకు రేఖ ముఖం మీది విలాసపునవ్వు ఎగిరిపోయింది. "మీస్నేహితురాలా?" అని ప్రసూనను అడిగాడు మోహన్—

"అవును" అందిరేఖ.

"కాదు" అనలేకపోయింది ప్రసూన.

"నేను వస్తాను. థాంక్సు!" అని వెళ్ళిపోయాడు మోహన్..

రేఖ విలాసంగా నవ్వి "నేనూ వెళ్తాను. ఒకసారి నిన్ను చూద్దామని వచ్చాను" అని వెళ్ళిపోయింది.

ప్రసూన తన బేగ్‌లో అపురూపంగా దాచుకున్న కాగితం బయటకు తీసి చూసింది...అందులో రెండే రెండు మాటలున్నాయి.

"డియర్ సూనా!"

ఆనాడు ఆ ప్రేమలేఖలోది, తన దస్తూరి కాదని నిరూపిస్తూ మోహన్ రాసిన మాటలు.

(సశేషం)

అధికాహారోత్పత్తి సాధనలో

# గణపవరం సమితి కృషి

—శ్రీ కె. వెంకటేశ్వరరావు

పశ్చిమ గోదావరి జిల్లా గణపవరం పంచాయితీ సమితిలో 66 వేల యకరములు గోదావరి పశ్చిమ డెల్టా క్రిందసాగుచేయు విస్తీర్ణము వుండగా, అందులో 1974-75 సంవత్సరములో 35,720 యకరములు దాళ్వా సాగుచేయబడుతోంది. తక్కువ నీటితో ఎక్కువ విస్తీర్ణము సాగుచేయవచ్చునను విషయము సాంద్రవ్యవసాయ పథకమువారు బహుళ ప్రచారము చేసి ప్రదర్శనక్షేత్రములు ఏర్పాటు చేసి రైతులకు నమ్మిక కలిగించారు. తక్కువనీటితో ఎక్కువ విస్తీర్ణము సాగుచేయుటకు వీలగా నుండుటకు ఈ సమితి రైతులు అక్టోబరు 20 వతేదీనుండి నారుమళ్లు పోసి నవంబరు 20 నుండి వూడ్పులు ప్రారంభించి డిశంబరు 10 వతేదీ నాటికి పూర్తి చేసినారు. మార్చిలో పంట కోతకు వచ్చును. లోగడ ఫిబ్రవరి నెలలో వూడ్చి మే నెలలో పంట కోసెడివారు. ఈ విధముగా చేయుట వలన చివరినెలలలో నీటి ఎద్దడి వచ్చి కొంత భాగము పంట దెబ్బతినేది. వేసవికాలములో గోదావరి నదిలో నీటి ప్రవాహము తక్కువ గానున్నందున తక్కువ విస్తీర్ణములో దాళ్వాసాగుచేయుటకు లోగడ పర్మిషను యిచ్చేవారు. కాని యిప్పుడు రెండవ పంట సాగు అక్టోబరునుండి ప్రారంభించి మార్చినెలలో ముగించుచున్నందున గోదావరి నదిలోనున్న నీటితో ఎక్కువ విస్తీర్ణము సాగుచేయుటకు జిల్లా అధికారులు పర్మిషను యిచ్చినారు. రొటేషను దాళ్వాపద్ధతి ప్రకారము ఈ సమితిలో 22 వేల యకరములలో మాత్రమే దాళ్వా పంట సాగుచేయుటకు వీలుకలుగుతుంది కాని ముందుగా వ్యవసాయ పనులు ప్రారంభించి ముందుగా ముగించుచున్నందున అదనముగా 15 వేల యకరములు ఈ సంవత్సరము దాళ్వా సాగుచేయుటకు ఈ సమితికి జిల్లాకలెక్టరుగారు అనుమతించారు. ఈ విధముగా చేయటం వలన ఏవిధమైన నీటి ఎద్దడిలేకుండా ఎక్కువ పంట దిగుబడి వచ్చుటకు అవకాశము కలుగుతోంది.

చలికాలములో వూడ్చుటవలన ఎక్కువ తెగుళ్లువచ్చుటకు అవకాశమున్నది. కాని ఈ సమితిలోని రైతులు ఎప్పటికప్పుడు అవసరమైన సస్యరక్షణ చర్యలు తీసుకొంటూ క్రిమికీటకముల నుండి రక్షించుచున్నారు. ఎక్కువ విస్తీర్ణములో సస్యరక్షణ చర్యలు శీఘ్రముగా తీసుకొనుటకుగాను ఈ సమితిలో బానమిల్లి, అడవి కొలను, పెద నింద్రకొలను, రాలిపాడు, అరవరం, పడమర విప్పర్రు, కేశవరం, జల్లి కాకినాడ మొదలైన గ్రామములలో 5,000 యకరములకు విమానము ద్వారా క్రిమి సంహారమందులు జల్లించుటకు ఏర్పాట్లు చేయబడినవి. 11-1-75 వ తేదీన బానమిల్లి గ్రామములో పశ్చిమ గోదావరి జిల్లా కలక్టరు శ్రీ జి. కుమారస్వామి రెడ్డిగారు విమానము ద్వారా మందులు చల్లించు కార్యక్రమము ప్రారంభించినారు. ఇంత వరకు బానమిల్లి, అడవికొలను, పెద నింద్రకొలను గ్రామములలో క్రిమిసంహారక మందులు విమానము ద్వారా చల్లుట పూర్తియైనది. మిగిలిన గ్రామములలో కొద్దిరోజులలో పూర్తి అవుతుంది.

విమానము (హెలికాప్టరు) ద్వారా రెండుసార్లు పురుగు మందు డెమక్రాన్ జల్లుటకు యకరమునకు రు.65/-లు ఖర్చుఅగును. దీనికి గాను సహకార సంఘములు రైతులకు స్వల్పకాలిక అప్పులు యిస్తున్నాయి.

ఈ సంవత్సరపు దాళ్వా వరి పంటకు నత్రజని యిచ్చుటకు జిల్లా కలక్టరుగారు అంగీకరించినారు. డిశంబరు 10వ తేదీకి కొంత నత్రజనియిచ్చుట పూర్తియైనది. ఇదుపరి కలక్టరుగారు ప్రాజెక్టు ఆఫీసరుగారు ఏర్పాటుచేసిన ప్రకారము గుజరాత్ నుండి యూరియా తీసుకొని వచ్చి మిగిలిన నత్రజనిని రైతులకు సరఫరా చేయటం పూర్తియైనది. ప్రతి యకరమునకు నత్రజని పూర్తిగా సకాలములో సరఫరా చేసిన ఘనత జిల్లాలో ఈ సమితికే దక్కినది. ఇవిగాక అదనముగా ప్రతి యకరమునకు ఒక కాంప్లెక్సు బస్తా ఎరువులు కూడ యిచ్చుట జరుగుతున్నది.

గుజరాత్ నుండి ఎరువులు తెప్పించుటకు ఆర్థిక కారణముల వలన జిల్లా మార్కెటింగు ఫెడరేషనువారు వెనుకంజవేయగా ఈ సమితి అధ్యక్షులైన శ్రీ జువ్వల్లి వెంకట్రామయ్య గారు రైతుల నుండి 25 లక్షల రూపాయలు సొమ్ము వసూలుచేసి సహకార కేంద్ర బ్యాంకుకు సమితిచే ముందుగా చెల్లించే ఏర్పాట్లు చేసి జిల్లాలో మార్గదర్శకులైనారు. అందువలననే యకరమునకు కొంత నత్రజని చొప్పున అందరు రైతులకు ఎరువులు ముందుగా సరఫరా చేయబడినవి. సకాలములో ఎరువులు వేసినందున పంట దిగుబడి రెట్టింపు వస్తుంది. సమితి అధ్యక్షుని కృషి ఫలితమువలననే సకాలములో రెండవ పంటకు ఎరువులువేయుట వీలుపడినదని, తత్ఫలితముగా హెచ్చు దిగుబడి వస్తుందని రైతుసోదరులాసిస్తూ ఈ సమితి అధ్యక్షులకు కృతజ్ఞతలు తెలియచేస్తున్నారు. సమితి అధ్యక్షునికి చేదోడు వాదోడుగా వుండి సమితి చేపట్టిన కార్యక్రమములు అమలు పరుచుటకు అహర్నిశలు పని చేస్తున్న బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు శ్రీ పిళ్లా కనకాంబరరావుగార్ని గూడ ఈ సమితి రైతులు మరువజాలరు. వీరిద్దరి కృషి ఫలితంగా ఈ సమితిలో పంట దిగుబడి యకరమునకు సరాసరి 35 బస్తాలకు తగ్గదని భావిస్తున్నారు.

మన రాష్ట్రములో గణపవరంలాంటి పంచాయతీ సమితి వుండుటవలననే భారత దేశములో ఆంధ్ర ప్రదేశ్ అన్నపూర్ణ యని నానుడి వచ్చినది. ఈ గణపవరం సమితి 1964 లో రాష్ట్రములో ఉత్తమ పంచాయతీ సమితిగా ఎన్నిక కాబడి ప్రభుత్వము నుండి 20 వేల రూపాయలు రొఖ్ఖం బహుమతిని పొందినది.

# వార్తావాహిని

# ప్రధానమంత్రి 20 సూత్రాల

## కార్యక్రమానికి ప్రజల మద్దతు

— స్వరాజ్య లక్ష్మి

దేశంలోని సామాన్య ప్రజల జీవనపరిస్థితులను సత్వరంగా మెరుగుపరచడానికి ప్రధానమంత్రి 20 సూత్రాల నూతన ఆర్థిక కార్యక్రమాన్ని ప్రకటించారు. ఆర్థికవ్యవస్థను చక్కదిద్ది, ప్రజాస్వామ్యంలోని పౌరహక్కులను పరిరక్షించే యీ కార్యక్రమాన్ని త్రికరణశుద్ధిగా అమలు పరుస్తామని ప్రజలు, ప్రభుత్వాలు సన్నద్ధతను ప్రకటించడం జరిగింది. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు ప్రభుత్వ కార్యదర్శుల సీనియర్ అధికారుల సమావేశం ఏర్పాటు చేసి, కార్యక్రమాన్ని అమలు పరచడానికి ఏఏ చర్యలు తీసుకోవాలి అనే విషయం గురించి సుదీర్ఘ చర్చలు జరిపి నిర్ణయాలు తీసుకొన్నారు.

వివిధ రంగాల్లోని ప్రజలు, ప్రజాస్వామ్యం పట్ల సానుభూతి ప్రకటించే అన్ని వర్గాలకు చెందినవారూ, సోషలిస్టు లక్ష్యాల కనుగుణంగా రూపొందించబడిన ప్రధాని నూతన కార్యక్రమానికి తమ మద్దతును ప్రకటిస్తూ అభివృద్ధి కృషిలో తమ సంపూర్ణ సహకారాలను అందించడానికి నిశ్చయించారు.

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ సంఘాధ్యక్షులు శ్రీ వీరమాచనేని వెంకటనారాయణ నూతన ఆర్థిక కార్యక్రమాన్ని సమర్థిస్తూ రాష్ట్ర ప్రజలంతా ప్రధానమంత్రికి తమ పూర్తి మద్దతు యివ్వాలని పిలుపు నిచ్చారు.

నెల్లూరు జిల్లాకు చెందిన ఐ.ఎన్.టి.యు.సి., యూత్ కాంగ్రెస్, జాతీయ విద్యార్థి సంఘం తమ సమావేశంలో అభ్యుదయ సంస్కరణలు అమలుపరచడంలో జిల్లా అధికారులకు సహాయపడడానికి ఐచ్ఛిక నిఘాదళాలను ఏర్పాటుచేయాలని నిర్ణయించారు. ఫారెస్టు ప్లాంటేషన్‌కు చెందిన గిరిజన కార్మికుల సంఘం రాజమండ్రిలో సమావేశమై యీ కార్యక్రమానికి తమ సంపూర్ణ సహకారాన్ని అందివ్వాలని తీర్మానించింది. హైదరాబాదులో 50 మంది సుప్రసిద్ధ ఉర్దూ కవులు ప్రధాని పథకానికి మద్దతునిస్తూ, యీ కార్యక్రమం అమలుకు తమ పూర్తి సహకారం లభిస్తుందని రాష్ట్ర కార్మిక శాఖ మంత్రి శ్రీ టి. అంజయ్యగారికి ఒక వినతిపత్రంలో తెలియచేశారు. ఆంధ్రప్రదేశ్‌లోని ఏభయి ట్రేడ్ యూనియన్ సంస్థలు తమ మద్దతును ప్రకటిస్తూ కార్మిక శాఖ మంత్రికి టెలిగ్రాములు పంపించాయి. అఖిల భారత మైనారిటీలు, బలహీనవర్గాల ఫెడరేషన్ ఆంధ్రప్రదేశ్ శాఖ, దేశ సంక్షేమానికి ప్రధాని చేస్తున్న కృషిని ప్రశంసిస్తూ, 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమానికి తమ మద్దతును ప్రకటించింది. అంతర్జాతీయ మహిళాసంవత్సరోత్సవ నిర్వహణ జాతీయ సంఘ సభ్యులు ప్రధానమంత్రి నూతన కార్యక్రమం మన అభ్యుదయానికి మార్గమని తమ మద్దతును ప్రకటించారు. మహబూబ్‌నగర్ టౌన్‌హాల్‌లో సమావేశమయిన జిల్లాలోని వివిధ స్వచ్ఛంద సేవాసంస్థలు, ట్రేడ్‌యూనియన్‌లు యీ కార్యక్రమాన్ని సమర్థిస్తూ, దీని అమలుకోసం ప్రజాసంఘాలను స్థాపించాలని సూచించాయి. హైదరాబాదులోని గాంధీభవన్‌లో జరిగిన తెలంగాణా స్వాతంత్ర్య సమరయోధుల సమావేశంలోనూ, హైదరాబాదులోని నెహ్రూ ఫౌండేషన్ సంస్థ అత్యవసర సమావేశంలోనూ, హైదరాబాదు డివిజన్ ఆర్.యం.యస్ ఎంప్లాయీస్ యూనియన్ సమావేశంలోను, సికిందరాబాదు స్వాతంత్ర్య సమరయోధుల సమావేశంలోను, ఆంధ్రప్రదేశ్ వెనుకబడిన వర్గాల ఉద్యోగుల సంఘం సమావేశంలోను, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ పంచాయతీరాజ్ విభాగం సమావేశంలోను, హరిజన వింగ్ సమావేశంలోను ప్రధాని ఆర్థిక కార్యక్రమానికి మద్దతును ప్రకటిస్తూ తీర్మానాలు చేశారు. వరంగల్ జిల్లా కాంగ్రెస్ సంఘం హనుమకొండలో శ్రీ టి. హయగ్రీవాచారి అధ్యక్షతన సమావేశమై ప్రధానమంత్రికి తమ మద్దతును ప్రకటించింది. జంటనగరాల్లోని గుడిసెవాసుల సంక్షేమ సంఘం, హైదరాబాదు కిరాణా వర్తకుల సంఘం, సికిందరాబాదు సిగరెట్టు, అగ్గిపెట్టెల వ్యాపారస్థుల సంఘం, దక్షిణ మధ్య రైల్వే సిగ్నల్ టెలికమ్యూనికేషన్స్ వర్క్‌షాప్ సిబ్బంది, ఆంధ్రప్రదేశ్ పాలిటెక్నిక్ కళాశాల విద్యార్థుల సంఘం, ఆంధ్రప్రదేశ్ నోటరీస్ అసోసియేషన్, హైదరాబాదు నగర యూత్ కాంగ్రెస్ కమిటీ, సికిందరాబాదు నూనె వర్తకుల సంఘం ప్రధాని 20 సూత్రాల కార్యక్రమానికి తమ సంపూర్ణ సహకారాన్నీ, మద్దతునూ ప్రకటించాయి.

జవుళి, చేనేత పరిశ్రమ శాఖమంత్రి శ్రీ కె. వి. కేశవులు తెలంగాణా ప్రాంతంలోని ప్రాథమిక చేనేతసహకార సంఘాల ప్రతినిధులను సమన్వయపరిచి ప్రధాని 20 సూత్రాల పథకాన్ని దృష్టిలో ఉంచుకొని, చేనేత పరిశ్రమాభివృద్ధికి తోడ్పడాలని కోరారు.

ఆంధ్రప్రదేశ్ ధాన్యం, విత్తనాల వ్యాపారస్థుల సంఘం ఆహారధాన్యాల పంపిణీ సక్రమంగా జరగటానికి పూర్తిగా

సహకరిస్తామని ప్రకటించారు. అత్యవసర పరిస్థితి ప్రకటన వల్ల వ్యాపార వర్గాలమీద కొత్త బాధ్యత పడిందనీ, క్రమశిక్షణతో కూడిన వర్తక వాణిజ్యాలు అవసరమనీ, ఆ సంఘం అధ్యక్షులు శ్రీ సత్యనారాయణ గుప్త ప్రకటించారు. హైదరాబాద్‌లోని దినపత్రికల సంఘం అధ్యక్షులయిన రెహనుమా దక్కన్ సంపాదకులు శ్రీ సయ్యద్ వికారుద్దీన్, ఇండియన్ హెరాల్డ్ సినీ హెరాల్డ్‌ల సంపాదకులు శ్రీ ఠాకూర్ హరిప్రసాద్, దక్కన్ క్రానికల్ మేనేజింగ్ ఎడిటర్ శ్రీ కె ఆర్. పట్టాభిరామన్, అంగారే సంపాదకులు శ్రీ మోయిాన్ ఫారూకీ, ప్రధాన మంత్రినీ, రాష్ట్రపతినీ కలిసి తమ మద్దతును ప్రకటించారు.

ప్రాగాటూల్స్ కంపెనీ అధికార్ల సంఘం ప్రధానమంత్రి 20 సూత్రాల కార్యక్రమానికి తమ మద్దతునిస్తూ కంపెనీ లక్ష్యాలను సాధించడానికి అత్యవసర పరిస్థితి కొనసాగినంత కాలంలో ప్రతీ రోజూ ఒక గంట ఎక్కువగా పనిచేయడానికి నిర్ణయించుకొంది.

[ ఈ విధంగా రాష్ట్రం నలుమూలల నుండి అసంఖ్యాకంగా స్వచ్ఛంద సంస్థలు, సేవా సంఘాలు, వివిధ కమిటీలు, యూనియన్‌లు ప్రధాన మంత్రి 20 సూత్రాల పథకానికి తమ పూర్తి మద్దతును ప్రకటించాయి ]

## నూతన కార్యక్రమంతో నవచైతన్యం

జులై 3 వ తేదీన జరిగిన మంత్రివర్గ సమావేశంలో పంచాయతీసమితులలో 100 మంది ఎం. బి, బి. యస్. డాక్టర్లను నియమించాలని నిర్ణయంజరిగింది. వీరికి ఒక సంవత్సరంపాటు నెలకు రూ. 500 గౌరవ వేతనం లభిస్తుంది. మూడేండ్లలోగా యీ విధంగా అన్ని సమితుల్లోనూ డాక్టర్లను నియమిస్తారు. దీని వల్ల యోగ్యులై వుండి నిరుద్యోగులైన డాక్టర్లకు ఉపాధి సౌకర్యం కలుగుతుంది. రెండవ సంవత్సరంలో నెలకు రూ. 400, మూడవ సంవత్సరంలో రూ. 300 గౌరవ వేతనం యిస్తారు. వీరు ప్రైవేటుగా కూడా ప్రాక్టీసు చేసుకోవచ్చు. ఈ సమావేశంలోనే వ్యవసాయ కూలీల కనీస వేతనాల సవరణ గురించి చర్చించారు.

విద్యాసంస్థలలో ప్రవేశానికి విద్యార్థుల వద్ద నుండి విరాళాలు వసూలు చేసేవారిపైన 'మిసా' చట్టంక్రింద చర్యతీసుకుంటారని విద్యాశాఖ మంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావు ప్రకటించారు.

ప్రధాన మంత్రి ప్రకటించిన 20 సూత్రాల పథకం క్రింద 1975-76 లో రూ. 8 కోట్లు ఖర్చయ్యే వివిధ పథకాలను ప్రభుత్వం తయారు చేసింది. ఈ డబ్బు రాష్ట్ర నిధులనుంచి ఖర్చుచేస్తారు. చేనేత రంగంలోవున్న నిలువ సరుకును విడుదల చేయడానికి రూ. 2 కోట్లు కేటాయించారు. పనిచేయకుండావున్న సంఘాలను బాగుపరచడానికి రూ. 1 కోటి, 60 ఉత్పత్తి కేంద్రాలను స్థాపించడానికి రూ. $1\frac{1}{2}$ కోట్లు ఖర్చు అవుతుంది.

నెల్లూరులో రూ. 2 లక్షలు విలువచేసే వడ్లు, బియ్యం, నూకలను అధికారులు స్వాధీనం చేసుకుని గిరిజన సహకార కార్పొరేషన్‌కు అప్పగించారు.

జులై 4వ తేదీన ముఖ్యమంత్రి కైకలూరులో ప్రసంగిస్తూ, కొల్లేరు ప్రాంతం రైతులకు ప్రయోజనకరంగా "మాస్టర్ ప్లాన్" అమలు పరుస్తారని ప్రకటించారు. యిక్కడి బీద ప్రజలు, హరిజనులు మొదలగు వారికి యిది ఉపయోగపడుతుంది. యిక్కడి వడ్డెర హరిజన ప్రజలు ఎక్కువగా వ్యవసాయం, చేపల వృత్తుల మీద ఆధారపడి వున్నారు. ప్రతిగ్రామంలోనూ చేపలు పట్టే వృత్తి గల వారందరినీ, మత్స్య పారిశ్రామిక సహకార సంఘంలో చేర్చుకుని వారికి బందరులోని కృష్ణాజిల్లా కేంద్ర సహకార బ్యాంకు నుండి ఆర్థిక సహకారం అందజేస్తారు. ఇది కృష్ణాజిల్లాలోని కొల్లేరు ప్రాంతపు 18 గ్రామాలకు వర్తిస్తుంది.

ఎన్ జి. ఓలకు వర్తించే విద్యాసౌకర్యాల క్రింద, ప్రతి ఒక్క విద్యార్థికి సాలుకు రూ. 35 లు ప్రభుత్వం యిస్తూవుండేది. యిప్పుడు దీన్ని రూ. 70 కు పెంచారు.

అదనంగా 7 లక్షల హెక్టార్ల విస్తీర్ణానికి సేద్యపు వసతులు కల్పించబడతాయనీ, అసంపూర్ణంగా వున్న నీటి పారుదల పథకాలు త్వరలో పూర్తి చేయబడతాయనీ ముఖ్యమంత్రి పులిగడ్డ అక్విడెక్ట్ వద్దజరిగిన శంకుస్థాపన సభలో ప్రకటించారు. రాష్ట్రంలోని మూడు విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షులు హైదరాబాద్‌లో సమావేశమై విద్యార్థి సంక్షేమ కార్యక్రమాలను గురించి చర్చించారు. ముఖ్యమంత్రి, విద్యామంత్రి ఈ సమావేశాన్ని ఏర్పాటుచేశారు. విద్యార్థులకు పుస్తకాలు, నోట్ పుస్తకాలు, స్టేషనరీ మొదలైనవి సప్లై చేయడంలో ప్రత్యేక శ్రద్ధ వహించాలనీ, హాస్టళ్ల నిర్వహణ కట్టుదిట్టంగా జరగాలనీ, సాంస్కృతిక క్రీడాకార్యక్రమాలను వృద్ధి పరచి విద్యార్థి మనోవికాసానికి చేయూత నివ్వాలని నిర్ణయించారు. రాష్ట్ర కార్మిక మంత్రి శ్రీ టి అంజయ్య పత్రిక సమావేశంలో ప్రసంగిస్తూ, జాతీయస్థాయిలో కనీస వేతనాల నిర్ణయం వెట్టిచాకిరి నిషేధం, పరిశ్రమల్లో, రైల్వేలతోసహా ప్రభుత్వ సంస్థల్లో నియామకాలు రాష్ట్ర పరంచేయడం, ప్రైవేటు, పబ్లిక్ రంగాలలోని పారిశ్రామిక సంస్థల్లో నియామక అధికార్లను రాష్ట్ర ప్రభుత్వం నుండి తీసుకోవడం మొదలగు ముఖ్యమైన విషయాల గురించి నిర్ణయాలు జరుగుతాయని చెప్పారు. రాష్ట్ర ప్రభుత్వ యాజమాన్యంలోగల పారిశ్రామిక సంస్థల్లో కార్మికులకు ప్రతినిధ్యం యివ్వాలనినిర్ణయం గైకొన్నట్లు ప్రకటించారు. హైదరాబాద్ ఆల్విన్ మెటల్ వర్క్సులో యీ ప్రాతినిధ్యం అప్పుడే కల్పించబడిందని మంత్రిచెప్పారు. సహకార సంస్థల్లోకూడా యీ సూత్రం వర్తింపజేయాలని ఆయన అన్నారు.

పాఠ్యగ్రంథాలు, ఎక్సర్‌సైజు నోటు పుస్తకాలు సెకండరీ పాఠశాలల ప్రధానోపాధ్యాయుల ద్వారా విద్యార్థులకు అందించాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిశ్చయించింది. సెక్రెటేరియట్‌లో జులై 7 వ తేదీన జరిగిన అధికార సమావేశంలో యీ నిర్ణయం తీసుకున్నారు. మంత్రులు శ్రీ ఎం.వి. కృష్ణారావు, భాట్టం శ్రీరామమూర్తి గారలు సమావేశానికి హాజరయ్యారు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 1975-76 విద్యా సంవత్సరంలో 12 ఉపాధ్యాయ శిక్షణ సంస్థలను ప్రారంభించాలని రాష్ట్ర ప్రభుత్వం

ఉత్తర్వు చేసింది. వాటిలో ఏడు తెలంగాణాలోను, 3 కోస్తా ఆంధ్రలోను, రెండు రాయలసీమలోను ఏర్పాటు చేస్తారు. ప్రతి మూడు నెలలకూ 350 మంది వంతున నిరుద్యోగులయిన యింజనీరింగ్ పట్టభద్రులను జూనియర్ యింజనీర్లుగా తీసుకోవాలని ప్రభుత్వం నిశ్చయించింది. లోగడ ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజీలలో రిజిస్టరు అయినవారికి వయః పరిమితి యిప్పుడు దాటిపోయినా దాన్ని పరిగణించకుండా ఉద్యోగాల్లోకి తీసుకొంటారు. ప్రాజక్టుల నిర్మాణపు పనులకు కంట్రాక్టులు తీసికోవడానికి వీరిని ప్రోత్సహిస్తారు. సాల్వెన్సీ సర్టిఫికెట్లుగాని, ఎర్నెస్టు మనీ గాని అవసరంలేదు.

హైదరాబాద్‌లో జరిగిన ఒక త్రైపాక్షిక సమావేశంలో రాష్ట్రంలోని బీడీ కార్మికుల వేతనాలను పెంచారు. పట్టణ ప్రాంతంలో ఇక మీందు వెయ్యి బీడీలకు రూ. 4 60 లు, గ్రామీణ ప్రాంతాల్లో రూ. 4 50 లు యిస్తారు. ఈ చర్యవల్ల 5 లక్షల మంది బీడీ కార్మికులకు లాభం కలుగుతుంది.

రాష్ట్రంలోని నూనెమిల్లు కార్మికుల కనీసవేతనాలను ప్రభుత్వం పెంచింది. ఈ పెంగుదల వాచ్‌మన్‌కు రూ. 146 30 నుండి కెమిస్టు ఉద్యోగికి రూ 521 వరకు 32 రకాల కార్మికులకు వర్తిస్తుంది. జూలై 6 వ తేదీ నుండి యీ ఉత్తర్వు అమలులోనికి వచ్చింది. ఒకే రకమయిన పనిలో పురుషులకుగాని, స్త్రీలకు గాని యిచ్చేవేతనాలలో తేడా ఉండకూడదని ప్రభుత్వం ఆదేశించింది.

ఉపాధ్యాయుల సంక్షేమ సంఘం విద్యామంత్రి శ్రీ మండ వెంకట కృష్ణారావు అధ్యక్షతన సమావేశమై సంక్షేమనిధికి ఒక కోటి రూపాయలు సమకూర్చాలని నిశ్చయించింది. కూపనుల అమ్మకం ద్వారాను, సినిమా బెనిఫిట్ షోల ద్వారాను, ఒక ప్రత్యేక రాఫిల్ నిర్వహించడం ద్వారాను యీ నిధిని సమకూరుస్తారని విద్యామంత్రి వివరించారు.

ప్రస్తుత సంవత్సరంలో 586 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యాలు కల్పించాలని 10,00 వ్యవసాయ పంపుసెట్లకు విద్యుచ్ఛక్తి సమకూర్చాలని ప్రభుత్వం నిశ్చయించింది. గ్రామీణ విద్యుదీకరణ సంస్థ యొక్క నిధులసాయంతో ఆంధ్రప్రదేశ్‌లో 4000 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యాలను కల్పించాలనీ, 41000 పంప్ సెట్లకు విద్యుచ్ఛక్తి నందివ్వాలనీ ప్రభుత్వం సంకల్పించింది.

సహకార సంఘాల రిజిస్ట్రార్ శ్రీ టి. లక్ష్మారెడ్డి అధ్యక్షతన జరిగిన ఒక సమావేశంలో పూర్తిగా మహిళలచేత నిర్వహింపబడే ఐదు సూపర్‌బజార్లను జంటనగరాలలో స్థాపించాలనే నిర్ణయం తీసుకొన్నారు. అంతర్జాతీయ మహిళా సంవత్సర సందర్భంగానూ, ప్రధానమంత్రి ప్రకటించిన కొత్త ఆర్థిక ప్రణాళికలో మహిళలకు ప్రాధాన్యతనిస్తూ వారి అభ్యున్నతికి బాటలు వేయాలనే సంకల్పంతోను యీ నిర్ణయం తీసుకొన్నారు. వీటిలో కంట్రోలు ధరలకు అమ్మబడే వస్తువులను, నిత్యావసర వస్తువులను నిర్ణీత ధరలకు ప్రజలకు సరఫరా చేస్తారు.



# ప్రధాన మంత్రి ప్రణాళిక అమలుకు సన్నాహాలు

ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ ప్రకటించిన 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమం అమలుపరచే సందర్భంగా సహకారశాఖా మంత్రి శ్రీ బత్తిన సుబ్బారావు ఆ శాఖ రిజిస్ట్రారు శ్రీ టి. లక్ష్మారెడ్డి, యితర సీనియర్ అధికారులతో చర్చలు జరిపారు. కొన్ని ముఖ్యమైన నిర్ణయాలు తీసుకున్నారు

గత సంవత్సరం ప్రారంభించిన "క్రాష్ ప్రోగ్రాం" సత్వరంగా అమలు పరచడానికి మిగిలిన 133 తాలూకా కేంద్రాల లోనూ వినియోగదార్ల స్టోర్సులు ఏర్పాటు చేస్తారు. (ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు తాలూకా స్థాయిలో సూపర్ బజార్లు ప్రారంభించబడతాయని జులై మధ్యలో ప్రకటించారు) విద్యా సంస్థలలో కూడా పుస్తకాలు, స్టేషనరీ సప్లైకోసం స్టోర్సు తెరుస్తారు. హాస్టళ్లకు వీటి ద్వారానే అత్యవసర వస్తువులు సరఫరా జరుగుతాయి. పారిశ్రామిక సంస్థలలో కూడా కార్మికులకోసం స్టోర్సు ఏర్పాటు చేస్తారు. పట్టణాలలో కార్మికులు అధికంగా నివసించే ప్రాంతాల్లో సూపర్ బజార్ బ్రాంచీలు తెరుస్తారు

వ్యవసాయ పరపతి విషయంలో యిదివరకు 75 శాతం వరకు బలహీనవర్గాల వారికి అందే ఏర్పాట్లు చేస్తారు. ప్రస్తుత పరిమితి శాతం. ఇంటి ఖర్చుల కోసం యిచ్చే ఋణాల పరిమితి రూ. 50 నుండి రూ 250 వరకు పెంచుతారు. బలహీనవర్గాల వారి నందరినీ సహకారరంగం పరిధిలోకి రప్పించి, వారిని వడ్డీవ్యాపారస్థుల బారినుండి తప్పించడానికి ఉద్యమస్థాయిలో కృషి జరుగుతుంది. బలహీన వర్గాల వారి కోసం ప్రత్యేకంగా స్థాపించిన సహకార సంఘాల ఆర్థికస్తోమత పెంచడానికి బడ్జెట్లో రూ. 50 లక్షల కేటాయింపును కోటి రూపాయలకు పెంచడానికి మంత్రి అంగీకరించారు.

## బియ్యం ధరల తగ్గింపు

భారత ఆహార సంస్థ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సహకార మార్కెటింగ్ ఫెడరేషన్, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పౌర సరఫరాల కార్పొరేషన్ ద్వారా విడుదలయ్యే బియ్యం ధరలను జూలై 2 వ తేదీ నుండి తగ్గిస్తూ ప్రభుత్వం ఉత్తరువు జారీచేసింది.

| కొత్త ధరలు : | | ఉన్నధర | తగ్గించిన ధర |
|---|---|---|---|
| సూపర్ ఫైన్ రకం | 100 కేజీల బస్తా 1 కి | రూ. 179 19 | రూ. 176 67 |
| ఫైన్ రకం | | 165.54 | 163 31 |
| మధ్యరకం | | 150.05 | 147.91 |
| ముతకరకం | | 144.93 | 142.87 |

దీంతో చవుక దుకాణాల్లో ఆయారకాల ధరలు బస్తాకు రూ. 2-52 నుండి రూ. 2.06 వరకు తగ్గుతాయి.

## నిల్వలు ప్రకటించాలి

1976 సం॥పు ఆంధ్రప్రదేశ్ వడ్లు, బియ్యం (నిల్వల స్వాధీనం) ఉత్తరువును ప్రభుత్వం యిటీవల సవరించింది.

దీని ప్రకారం 10 ఎకరాలు, అంతకు మించి వరి పండించిన ఆసాములు, 100 క్వింటాళ్లు లేక అంతకు మించి వడ్లు, లేక దానికి సరిపడిన బియ్యం నిలువవున్న వారు ప్రతి నెలా 5 వ తేదీలోపల తాసీల్దారుకుగానీ, డిప్యూటీ తాసీల్దారుకుగానీ నిలువలను గురించి ప్రకటన యివ్వాలి. ముందు నెలలో కొన్నవీ, అమ్మినవీ వివరాలు చూపించాలి.

## భూ సంస్కరణలు

మన రాష్ట్రంలో భూ సంస్కరణల చట్టం క్రింద భూస్వాములు 4 లక్షల 20 వేల డిక్లరేషన్లు సమర్పించారు. ప్రత్యేకంగా యిందుకోసం నియమించబడిన స్పెషల్ డిప్యూటీ తహసీల్దార్లు వీటిని పరిశీలిస్తున్నారు. ఇంకా డిక్లరేషన్లు యివ్వని 50 వేల మంది భూస్వాములకు భూసంస్కరణల ట్రిబ్యునల్స్ నుండి 8 (2) సెక్షన్ క్రింద నోటీసులు జారీ చేయడం జరిగింది. ప్రధాన మంత్రి ఆదేశాలమేరకు ఈ కార్యక్రమం త్వరిత గతిలో పూర్తి చేయడానికి ప్రభుత్వం దృఢసంకల్పంతో వుంది.

# విందు

"సోమశర్మ సూరి"

కనమే దినము నందు
తెనుగు సీమను, బందు
ఆనాడె, అనుకొందు
ఆంధ్రతేజపు విందు!

అధికారు లెందు, దు
ర్వ్యధికారులనకుందు
నే నందు ననుకొందు.
మాననీయపు విందు!

గ్రామ్యమౌ తారత
మ్య మ్మేడ గనకుందు
ఆవాడ అనుకొందు
ఆహ్లాదముల విందు!

న్యూనతాధిక్యతల
గాన దెప్పటి పొందు
అప్పుడే అనుకొందు
కప్పురమ్ముల విందు!

ధనమెందు సకల సా
ధనము గాదని విందు!

అండె, నే ననుకొందు,
'హాయి, హాయ్' అను విందు!

డాంబికాచార సం
తతి కెన్నడౌ బందు
ఆనాడె అనుకొందు
గానామృతపు విందు!

విజ్ఞాన ధనము 'స
ర్వేత్రా' యెపుడు, కందు?
ఆ నిమేషమె, అందు,
భానూదయపు విందు!

అఖిల మానవ సోద
రత యెన్నటి పసందు
ఆ త్రుటినె, అనుకొందు,
అమృతాంధసుల విందు!

ఏ కడల ప్రేమార్ద్రి
శీకరమ్ములు చిందు
ఆ కడలె యందు పా
ల్కడలి పొంగుల విందు!

## నాలుగు భారీ ప్రాజెక్టులకు రూ. 63 కోట్ల ప్రపంచ బ్యాంక్ ఋణం

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని నాలుగు భారీ ప్రాజెక్టులకు ప్రపంచ బ్యాంకు రూ. 63 కోట్లను ఋణంగా యివ్వనున్నది. ఈ ఋణం 1976 సంవత్సరంనుండి ప్రారంభించి, మూడు సంవత్సరాలలో యిస్తారు. నాగార్జున సాగర్ కుడికాల్వ, నాగార్జున సాగర్ ఎడుమ కాల్వ, పోచంపాడు, తుంగభద్ర కాంప్లెక్సు నీటి పారుదల కార్యక్రమాలను ముమ్మరంగా విస్తారం చేయడానికి యీ ఋణం ఉద్దేశించబడింది. రాష్ట్రంలో యింత భారీ యెత్తున ముమ్మర విస్తరణ కార్యక్రమం పద్ధతి ప్రకారం వ్యవసాయాభివృద్ధి కృషిని ప్రారంభించడం యిదే ప్రథమం. నాగార్జున సాగర్ ప్రాజెక్టు క్రింద 20 లక్షల ఎకరాలకు, పోచంపాడు ప్రాజెక్టు క్రింద 2.5 లక్షల ఎకరాలకు తుంగభద్ర కాంప్లెక్సు క్రింద ఒక లక్ష ఎకరాలకు యీ విస్తరణ కార్యక్రమం లాభిస్తుంది.

# పాఠకుల లేఖలు

ఆర్యా,

పాహియాన్ భారత వర్ష యాత్ర, రాజమండ్రి రైలు–రోడ్డు బ్రిడ్జి చరిత్ర, తెలుగు భాష పుట్టుక–చరిత్ర, ఆంధ్రుల చరిత్ర మున్నగు వ్యాసములు వేయమని కోరుచున్నాను. శంకరాచార్యుల చరిత్ర, నదుల చరిత్ర, పుణ్యక్షేత్రముల చరిత్ర మున్నగు వ్యాసములు వేయండి

ప్రపంచ తెలుగు మహాసభల ప్రత్యేక సంచిక కాపీ తెప్పించుకొనుటకు ఆంధ్రప్రదేశ్ సంచికలో ఎడ్రసు వేయమని కోరుతున్నాను.

గోవిందరాజుల ముఖ్యప్రాణరావు
లక్ష్మీపోలరం.

[ ప్రత్యేక సంచికకోసం "ప్రపంచ తెలుగు మహాసభల" కార్యదర్శి, రవీంద్రభారతి, హైదరాబాదు. 1—అనే చిరునామాకు రాయండి— సం. ]

మహాశయా : వందనములు

మీచే ప్రచురింపబడుతున్న "ఆంధ్రప్రదేశ్" పత్రికను చదివాను. ఆంధ్రప్రదేశ్ ప్రజానీకానికి ఈలాంటి పత్రిక వుండటం శ్లాఘనీయమే. పత్రికను పరిశీలింపగా, స్వాతంత్ర్య సమరయోధుల గురించి, ప్రభుత్వ నాయకుల ప్రారంభోత్సవాల గురించి వున్నదే తప్ప ప్రజోద్ధరణ కార్యక్రమాలు, ప్రజోపకర విషయాలు ఎందునా కానరావు స్వాతంత్ర్య సమర యోధుల విషయాలు వద్దని కాదు.

ఈ ప్రజా ప్రభుత్వంలో ప్రజలకు అనేక సౌకర్యాలను కల్గించాము, కల్గిస్తున్నాము, కల్గించబోతున్నాం అని నాయకులు పత్రికాముఖంగా ప్రకటనలు చేస్తూనేవున్నారు. ఏ, ఏ జిల్లాలో అలాంటి కార్యక్రమాలు ఏమేమి జరిగాయి? ఇంకా ఏమి జరుగుతాయి? హరిజన, గిరిజన, వెనుకబడిన తరగతులవారి', అందవలసిన సహాయకార్యక్రమాలు, ఎక్కడెక్కడ సక్రమంగా జరిగాయి? అనే విషయాలను విధిగా మీరు సేకరించి ప్రచురించాలి అప్పుడే ప్రజలకు ఒక తృప్తి. ఆ విధంగా ఒకటొకటిగా ప్రచురిస్తూ వస్తే పెద్ద చదువరులు కాని ప్రజానీకం సహితం, పత్రికద్వారా ప్రభుత్వం చేసే సహాయకార్యక్రమాలను తమ నాయకులు తమకోసం పాటుబడే తీరును చూచి ప్రభుత్వం మీద సదభిప్రాయాన్ని యేర్పరచుకొని మనసా, వాచా పాటుబడతారని నా అభిప్రాయం.

డా॥ కోటశిల
తిరుమల.

[ సాధారణంగా ప్రభుత్వ నాయకులు చేసే ప్రారంభోత్సవాలన్నీ ప్రజోద్ధరణ కార్యక్రమాలే అనే విషయం గమనించగోర్తాము. జిల్లాల్లో సమితుల్లో జరిగే అభివృద్ధి కార్యక్రమాలు ప్రకటిస్తూనే వున్నాం గదా—సం. ]

ఎడిటర్ గారికి,

జూలై నెల "ఆంధ్రప్రదేశ్" అందినది అందులో శ్రీ మిరియాల రామకృష్ణగారి "శంపాధ్వజాలు", శ్రీమతి మీనాక్షి పొన్నుదొరై గారి "తెనుగు తల్లికి నా అంజలి" అనే రెండు కవితలూ చాలా బాగున్నాయి ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి జీవిత సంగ్రహము చదివినంతసేపూ యిట్టి నిస్వార్థసేవాపరులు నేడుంటే దేశం ఎంత బాగుపడేదో అనిపించింది. "కలియుగభీమ" కోడి శ్రీరామమూర్తి నాయుడుగారి చరిత్ర మమ్మల్ని ఆశ్చర్యచకితుల్ని చేసింది తూర్పు యాసతోకూడిన "మరోపెపంచం" మంచి గమ్మత్తుగా ఉంది. శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారి భారతానువాదం మంచి ఆసక్తిని కలిగిస్తూంది మిగిలిన వ్యాసాలు, వార్తా చిత్రాలు విజ్ఞానాత్మకంగా ఉన్నాయి. ఇంతచక్కగా యీ పత్రికను తీర్చిదిద్దుతున్న మీకు మా ధన్యవాదాలు.

పులవర్తి సత్యవాణి, రాము.
రామమందిరం వీధి, గవర్నరుపేట, విజయవాడ—2.

మీరు ప్రచురించిన "జూలై" "ఆంధ్రప్రదేశ్" మాస పత్రికకు "తెలుగునాట వరినాట్లు" ముఖచిత్రం ప్రత్యేక ఆకర్షణ. మరియు మరో ప్రపంచం, "బుజ్జాయి గారి" 'ఆంధ్ర కేసరి' సీరియల్స్ అత్యంత ఆనందకరంగా వుంది. చదివేందుకు ఎంతో ఆసక్తిదాయకంగా వున్నాయి. "ప్రపంచ తెలుగు మహాసభలకు హాజరైన విదేశీ ప్రతినిధి వర్గాల సంక్షిప్త పరిచయం విశేషంగా వుంది.

"మహాభారతం" సీరియల్ ఈ పత్రికకే హైలైట్. క్రొత్త సాంఘిక నవల సీరియల్‌గా ప్రచురిస్తున్నందుకు ఆనందిస్తూ అభినందిస్తున్నాను.

గొట్టిముక్కల మనోహర్‌శర్మ
పెద్ద అడిశర్లపల్లి

"తెలుగునాట వరినాట్లు ముఖ చిత్రంతో జూలై మాసపు 'ఆంధ్రప్రదేశ్' పత్రిక చూడ ముచ్చటనున్నది "శంపాధ్వజాలు" కవిత బావుంది. 'మనశాసనసభ పనిచేసే తీరు' నుండి తెలియని విషయాలు తెలుసుకున్నాము. "కలియుగ భీమ కోడి రామమూర్తి" ఆంధ్రరత్న "ఆంధ్రకేసరి" మున్నగు వారి గురించి తెలిపినందుకు కృతజ్ఞతలు. ఇక ముందు కూడ ఇలాంటి వారిని గురించి తెలియ పరచగలరని మా మనవి.

ఎన్. సత్యనారాయణ
షాద్‌నగర్

ఆర్యా!

జూలై నెల నుండి పాఠకుల లేఖలు అనే క్రొత్త శీర్షికను ప్రారంభిస్తున్నందుకు మీకు చాల ధన్యవాదాలు ఒక్కోసారి ఒక్కో నెల పత్రికలో కొంతమంది రచయితల వ్యాసాలు నాపై ఎంతో ప్రభావాన్ని చూపి, నామనస్సును స్పందింప చేసి, నాలో రచనా భావాన్ని రేకెత్తిస్తాయి చరిత్ర ప్రసిద్ధిగన్న ప్రముఖ తెలుగు వారితో పాటు, చరిత్ర కందని, మరుగునపడ్డ వారి పరిచయాల్ని ప్రచురించాలని నా అభిలాష ఇటువంటిపత్రికను, ప్రజాపత్రికను, ప్రచురిస్తున్నందుకు నాహృదయ పూర్వక ధన్యవాదాలు.

ఎ. నాగరాజశర్మ
పీలేరు, చిత్తూరు జిల్లా.

అయ్యా!

జూలై నెల ఆంధ్ర ప్రదేశ్ ను చూడగానే మనసు నిండింది ముఖ చిత్రం చాలా ముచ్చటగా వున్నది ఇక ముందుకూడా ఆ విధంగానే మంచి పేపరులో ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ గారి ముఖ చిత్రంతో ఒక పత్రిక వెలువడితే బాగుండునని నా ఆశ! ముఖ్యంగా ఈ పత్రికలో రాజధాని విశేషాలు .. సినిమా పాటలలో సాహిత్యపు విలువలు-గురించిన వ్యాసాలు చాలా బాగున్నవి సినిమా చిత్ర సమీక్షలు నెల కో సినిమా గురించి ప్రచురించితే బాగుండునని ఆశ.

చక్కా సూర్యనారాయణ మూర్తి
నిమ్మకాయల కొత్తపల్లి.

[మీరు సిద్ధ సంకల్పులు ఆగస్టు నెల ముఖ చిత్రం మన ప్రధాన మంత్రిదే సినిమా చిత్ర సమీక్షలుకాదు గాని ప్రభుత్వం సినిమా పరిశ్రమకు యిచ్చే ప్రోత్సాహం గురించి ప్రకటిస్తుంటాం —సం]

---

## ఈ సంచికలో రచయితలు

శ్రీయుతులు

ఎల్. సూర్యనారాయణ రావు, ఆర్థికశాఖ, ఆంధ్రప్రదేశ్ సెక్రటేరియట్, హైదరాబాద్

పిడుగు రామలింగయ్య, కరస్పాండెంట్, ఆంధ్రపత్రిక కార్యాలయం మచిలీపట్నం.

టి రామచంద్రరావు, టెలివిజన్ సెటలైట్ ప్రత్యేకాధికారి, భారత ప్రభుత్వ వ్యవసాయ మంత్రిత్వశాఖ

తిరుమల రామచంద్ర, 69, ఆదర్శనగర్, హైదరాబాద్.

కె. ఆర్. కె. మోహన్, జూబిలీ పోస్టు ఆఫీస్, హైదరాబాద్.

జె. పీరాస్వామి, ఆం. ప్ర. పబ్లిక్ సర్వీస్ కమీషన్ సభ్యులు గృహకల్ప, హైదరాబాద్.

పేరేపు ఆంజనేయులు, పంచాయతీ సమితి, ఆత్మకూరు నెల్లూరు జిల్లా.

ఎస్. టి. జ్ఞానానంద కవి, మెక్లారెన్స్ ఉన్నత పాఠశాల, కాకినాడ, తూర్పు గోదావరి జిల్లా.

స్వరాజ్య లక్ష్మి, 12-1-75/1, ఆసిఫ్‌నగర్, హైదరాబాద్

టి. ప్రకాశ రావు, అసిస్టెంట్ డైరెక్టర్, సమాచార పౌరసంబంధ శాఖ

శ్రీమతి సి. ఆనందరామం, ఎస్ టి 26 మారేడ్‌పల్లి, సికిందరాబాద్

కె వెంకటేశ్వరరావు, బి. ఎ. సి ఆర్. ఓ., గణపవరం

కె లక్ష్మణ శాస్త్రి, 69, ఆదర్శనగర్, హైదరాబాద్.

దివాకర్ల వేంకటావధాని, 18/4 ఆర్. టి బర్కత్‌పురా, హైదరాబాద్

సుధామ, ఎం. ఎస్. 86, మలక్‌పేట 'బి' బ్లాక్స్, హైదరాబాద్.

పి. యస్. ఆర్. ఆంజనేయ శాస్త్రి, 1-8-248, చిక్కడపల్లి హైదరాబాద్.

సోమంచి సూర్యనారాయణ శర్మ, 2 టౌన్ పోలీస్ స్టేషన్‌వద్ద కాకినాడ, తూర్పుగోదావరి జిల్లా.



కేంద్ర పరిశ్రమలు. పౌరసరఫరాల స్టేట్ మంత్రి శ్రీ ఎ. పి. శర్మ జూలై 4న జూబిలీ హాలులో కేంద్ర సిల్కు బోర్డు 46వ సర్వ సభ్య సభకు ప్రారంభోత్సవం చేశారు. ఆంధ్రప్రదేశ్ చేనేత శాఖ మంత్రి శ్రీ కె. వి. కేశవులు అధ్యక్షత వహించారు.



కేంద్ర పరిశ్రమలు. పౌరసరఫరాల స్టేట్ మంత్రి శ్రీ ఎ. పి. శర్మ జూలై 4న హైదరాబాద్ లో ప్రభుత్వ ఉత్పత్తిదార్ల సహకార సంఘాల సమాఖ్యకు ప్రారంభోత్సవం చేశారు.

# నగరంలో వార్తా చిత్రాలు

కార్మిక మంత్రి శ్రీ టి. అంజయ్య, చేనేత శాఖ మంత్రి శ్రీ కె. వి. కేశవులు జూలై 1న హైదరాబాదు జిల్లాపరిషత్తు కార్యాలయంలో జంట నగరాల షెడ్యూలు కుల రిక్షా డ్రైవర్ల సహకార సంఘం సభ్యులకు సైకిల్ రిక్షాలను పంపిణీ చేశారు. ఈ కార్యక్రమానికి జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ ఎం. భోజిరెడ్డి అధ్యక్షతన వహించారు. ముఖ్య అతిథిగా విచ్చేసిన జిల్లా కలెక్టరు శ్రీ యు. రాఘవేంద్రరావును కూడా ఈ చిత్రంలో చూడవచ్చు.



# అంతర్జాతీయ తెలుగు అధ్యయన సంస్థ

అంతర్జాతీయ తెలుగు అధ్యయన సంస్థను తక్షణం ఏర్పాటు చేయాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది.

తెలుగు భాష, సాహిత్యమూ, అనుబంధ రంగాలలో పండితులు, మేధావులు, జాతీయ అంతర్జాతీయ సంస్థల సహకారంతో అధ్యయనం, పరిశోధనలూ జరపడానికి అవకాశాలు కల్పించే ఉద్దేశ్యంతో ప్రభుత్వం ఈ సంస్థను నెలకొల్ప తలపెట్టింది

ఈ సంస్థకు రాష్ట్ర ప్రభుత్వం సాలీనా మూడు లక్షల రూపాయలు గ్రాంటుగా ఇస్తుంది.

కేంద్ర ప్రభుత్వమూ, యునెస్కోల నుండి ఆర్థిక సహాయాన్ని అర్థిస్తుంది.

ఈ సంస్థను పబ్లిక్ గార్డెన్స్‌లో ఏర్పాటు చేస్తారు. ప్రభుత్వం దీనికి గవర్నర్ల బోర్డునూ, కార్యవర్గాన్ని, అకడెమిక్ కౌన్సిల్‌నూ ఏర్పాటు చేసింది విద్యామంత్రి శ్రీ కృష్ణారావు వీటికి అధ్యక్షులుగానూ, సంస్థ డైరెక్టర్ డాక్టర్ పి ఎస్. ఆర్. అప్పారావు సభ్యుడు, కార్యదర్శిగానూ ఉంటారు.

ఈ అధ్యయన సంస్థ ఏర్పాటు చేయాలనే ప్రతిపాదన కొంతకాలంగా ప్రభుత్వ పరిశీలనలో ఉన్నది. గత ఏప్రిల్‌లో నగరంలో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభ కూడా ఈ సంస్థ ఏర్పాటుకై ప్రభుత్వానికి సిఫార్సు చేసినది

ఈ సంస్థ లక్ష్యాలూ ఆశయాల సాధనకు ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ దోహదంచేసే కార్యకలాపాలన్నిటినీ నిర్వహిస్తుంది. పరిశోధనలు సాగించడానికి అవసరమైన వాతావరణాన్ని భౌతిక సౌకర్యాలనూ కల్పిస్తుంది. పండితులకు శిక్షణ సౌకర్యాలు కల్పిస్తుంది. దేశ విదేశాలలోని భాషా శాస్త్రవేత్తలూ, పండితులతో సంబంధాలను పెంపొందించుకోవడం, తెలుగు అధ్యయనాన్ని ప్రోత్సహించడానికి ఉపకార వేతనాలూ, గ్రాంట్లు మంజూరు చేయడం ఈ సంస్థ ప్రధాన కార్యక్రమం.

విద్యావిషయక పర్యటనలు, చర్చా గోష్ఠులు ఏర్పాటు చేయడం. ప్రచురణలకు తోడ్పడడం తెలుగు ప్రజల మధ్య సాంస్కృతిక సంబంధాలను పెంపొందించడానికి కూడా కృషి చేస్తుంది.

విద్యాశాఖ, ఆర్థికశాఖ కార్యదర్శులు, ఉన్నత విద్యాశాఖ డైరెక్టర్, రాష్ట్రంలోని ఐదు విశ్వవిద్యాలయాల వైస్‌ఛాన్సలర్లు, మూడు అకాడెమీల అధ్యక్షులు ఈ సంస్థ గవర్నర్ల బోర్డులో ఎక్స్–అఫీషియో సభ్యులుగా ఉంటారు. కేంద్ర విద్యా, సాంస్కృతిక వ్యవహారాల మంత్రిత్వశాఖల ప్రతినిధులు, యునెస్కో ప్రతినిధి; శ్రీయుతులు మోటూరి సత్యనారాయణ, వావిలాల గోపాలకృష్ణయ్య, దేవులపల్లి రామానుజరావు, ఎం. బి. రాజారావు, ఎన్ వి. రావు, కె. ఎస్. కోదండరామయ్య, బుర్రా వెంకటప్పయ్య, డాక్టర్ సి అప్పారావు (మలేసియా), తిరుమల తిరుపతి దేవస్థానం అధ్యక్షులు, గవర్నర్ల బోర్డు సభ్యులుగా ఉంటారు. యీ సంస్థకు లక్ష అంతకన్నా ఎక్కువ మొత్తం విరాళం ఇచ్చిన వ్యక్తికి కూడా గవర్నర్ల బోర్డులో సభ్యత్వం లభిస్తుంది

కార్యవర్గ సభ్యులుగా విద్యాశాఖ ఆర్థికశాఖల కార్యదర్శులు, ఉన్నత విద్యాశాఖ డైరెక్టర్, ఆంధ్రాయూనివర్శిటీ వైస్‌ఛాన్సలర్ శ్రీ ఎం. ఆర్ అప్పారావు, సాహిత్య అకాడెమీ అధ్యక్షులు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, శ్రీ బుర్రా వెంకటప్పయ్య, శ్రీ దేవులపల్లి రామానుజరావులను ప్రభుత్వం నామినేట్ చేసినది.

అకడెమిక్ కౌన్సిల్ సభ్యులుగా శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ వైస్‌ఛాన్సలర్‌నూ, శ్రీ మోటూరి సత్యనారాయణ, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యనూ, అధ్యయన సంస్థ అన్నిశాఖల అధిపతులనూ అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్, ఛీఫ్ లైబ్రేరియన్లనూ ప్రభుత్వం నామినేట్ చేసింది నామినేట్ చేసిన సభ్యుల పదవీకాలం మూడేళ్లు. వారిని తిరిగి నామినేట్ చేయవచ్చు.

# మహాభారతము

## శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

## 90

ఒక యభిప్రాయముననుసరించి సంవత్సరము చైత్ర మాసముతో నారంభించును గనుక అప్పటినుండి లెక్కించినచో పదకొండవ మాసము 'మాఘ' మాసమగును. సంవత్సరము 'మార్గశీర్ష' మాసముతో ప్రారంభించినను వారి యభిప్రాయము కాస్త్రా రము పదకొండవ నెల 'ఆశ్విన' మాసమగును. ఈ మాసము క్రొప రము సంవత్సరారంభము మార్గశీర్ష మాసముతోనగును గనుక 'మాసానాం మార్గశీర్షోస్మి' యను గీతావాక్యముగూడ పొసగుచున్నది: అప్పుడు కుంతీదేవి బంధువులనుండి భయపడి గర్భము ఎవరికీ తెలియకుండ దాచుకొని యుండెను. జనులు ఆ రహస్యమును తెలిసికొన జాలకుండిరి. కన్యాంతః పురమునందు కుంతీదేవికి పరిచర్యలు చేయుచుండిన నిపుణురాలైన ఒకదాదికి మాత్రము ఆ రహస్యము తెలిసియుండెను. కొంతకాలమునకు అమెకు, కన్యాత్వమునందే సూర్యసమాన తేజస్సుగల కొడుకు, సూర్యుని వంశమున జనించెను. ఆ బాలకుడు, తనతండ్రి వలెనే శరీరమునందు కవచ కుండలములతోను, సింహము కన్నులవంటి కన్నులతోను, ఎద్దు మూపువంటి భుజములతోను విరాజిల్లుచుండెను.

"ఆ బాలకుడు పుట్టగానే, కుంతీదేవి ఆప్తురాలైన దాదితో సంప్రతించి, ఒక పెట్టెను తెప్పించెను. అందు మెత్తని పరుపు పరపించెను. ఆ పెట్టెకు నలువైపుల నీరు చొరకుండ మైనము మెత్తించెను. బాలకునకు సుఖముగా నుండునట్లు అమర్చిన ఆ పెట్టె లోపల బాలకుని పండుకొనబెట్టి గట్టిగా పెట్టెను మూసి 'అశ్వ' నది యందు విడిచెను. (ఏ మాత్రము గాలి నీరు చొరరాకుండా గట్టిగా మూయబడిన ఆ పెట్టెయందు బాలకుడు, అమృతము నుండి పుట్టిన కవచకుండలములను ధరించినవాడు కనుక, మరణించకుండ నుండెను.) 'కన్యకగా నున్నప్పుడే గర్భధారణము నిషిద్ధము—అనుచితము' అని యామెకు తెలిసి యున్నప్పటికిని, పుత్రస్నేహముచేత మిక్కిలి దుఃఖించెను. ఆ పెట్టెను అశ్వనదిలో విడుచుచు కుంతీదేవి దుఃఖించుచు నిట్లనెను:——

"వత్సా! జలచర-స్థలచర-ఆకాశచరాది జంతువుల నుండి నీకు శుభమే కలుగుగాక; నీ మార్గములు మంగళకరములగుగాక; శత్రువులెవరును గూడ నీ కడకు రాకుందురుగాక; వారు వచ్చినను నీ యెడల ద్రోహము తలచకుందురుగాక. జలమునందు నిన్ను జలమునకు ప్రభువైన వరుణదేవుడు, ఆకాశమునందు వాయుదేవుడు నీ తండ్రియగు సూర్యుడు నిన్ను అన్నిచోట్ల రక్షింతురుగాక; నీ మార్గమునందు, సమతలములందును, ఎగుడుదిగుడులు గల చోట్ల యందును ఇంద్రాది సమస్త దేవతలు, సర్వదిక్కులు నిన్ను కాపాడుదురుగాక. నదిలో కొట్టుకొనిపోవుచున్న నిన్ను తన దివ్య దృష్టితో చూచుచున్న నీ తండ్రి సూర్యుడు నాకంటె ధన్యుడు. ఏ స్త్రీ నిన్ను పుత్రునిగా స్వీకరించునో, నీవు ఆకలి దప్పులచేత ఏ స్త్రీ యొక్క స్తన్యపానముతో తృప్తిచెందెదవో ఆమె కడు ధన్యురాలుగదా! సూర్యసమాన తేజస్సు, దివ్యకవచకుండలములు, కమలపత్ర విశాల నేత్రములు, సుందరలలాటము మనోహర కేశములు, కమల పత్రముల వలె ఎఱ్ఱని దేహము గల నిన్ను ఏస్త్రీ పుత్రునిగా స్వీకరించునో, ఆమె యెంతటి సౌభాగ్యవతి యోకదా! వత్సా! నీవు భూమిపైన దోగాడుచు, అవ్యక్తమధురముగా ముద్దుపలుకులు మాట్లాడుచు ధూళిధూసరితమ్మైయున్న నిన్ను చూచుచు ఆనందించగల వారే ధన్యులు. ఆ భాగ్యము నాకు లభించబోవదుగదా!"

"ఇట్లు అనేక విధములుగ దుఃఖించి కుంతి, ఆ పేటికను అశ్వనదీజలమునందు అర్ధరాత్రమునందు, దాది సహాయముతో విడిచి, తండ్రి మేల్కొనునను భయముచేత రాజభవనమునకు త్వరగా చేరెను.

"ఆ పేటిక అశ్వనది నుండి 'చర్మణ్వతి' నదియందు, అక్కడి నుండి యమునా నదియందు, యమున నుండి గంగా నదియందు పడి పారుచు పోయెను. ఇట్లు ఆ పేటిక గంగా తరంగడోలికలలో ఓలలాడుచు పోయి 'సూత' రాజ్యము నందలి 'చంపా' నగర సమీపమును చేరెను. అమృతము నుండి పుట్టిన సువర్ణ కవచ కుండలములను గలవాడగుటచేత ఆ బాలుడు జీవంతుడై చెక్కుచెదరక యుండెను.

## కర్ణుని పోషణము

"జనమేజయ మహారాజా! ఆ సమయమునందే ధృతరాష్ట్రుని మిత్రుడగు అతిరథుడు అను 'సూత' జాతి (రథము నడుపు వారి జాతి)కి చెందిన వాడు తన భార్యయగు 'రాధ' తో యాదృచ్ఛికముగా గంగా నదికి పోయెను. ఆ దంపతులకు సంతానము కలుగ కుండెను. సంతతి కొరకై రాధ యెన్నో వ్రతనియమాది ప్రయత్నములను జేసెను. ఆమె అప్పుడు నదీప్రవాహమునందు వచ్చిన పెట్టెను చూచెను. ఆ పెట్టెకు రక్షార్థమై కంకణము కట్టబడి, పైన అలంకారము చేయబడి యుండెను. దానిని చూచి యామె కుతూహలపడి సేవకులచేత ఆ పెట్టెను పట్టి తెప్పించెను. అతిరథునకు చూపగా నతడు దానిని యంత్రముల ద్వారా తెరిపించి యందు బాలుని చూచెను. ఆ బాలకుడు బాలసూర్యునివలె ప్రకాశించుచుండెను. బంగారు కవచము చేత శరీరము, తళతళ మెరయు కుండలములచేత ముఖము ఉజ్జ్వలము లై యుండెను.

"అప్పుడా సూతుడు భార్యతో పాటు మిక్కిలి ఆశ్చర్యము చెంది, ఆ బాలకుని తన యొడిలోనికి తీసుకొని భార్యతో, "ప్రియా! నేను పుట్టినప్పటినుండి యింతటి మహాద్భుతమును ఎప్పుడుగూడ చూడలేదు. ఇతడొక దేవబాలకుడే. అదృష్టవశమున లభించి నాడు. సంతానము లేని నాకు దేవతలు వరప్రసాదముగా బాలకుని ఇచ్చినారనుకొనెదను" అని చెప్పి యా బాలకుని రాధకిచ్చెను. ఆమె, యా దేవబాలకుని శాస్త్రోక్తముగా స్వీకరించెను. తోడనే యామెకు దైవయోగముచేత చనుబాలు చేపెను. శ్రద్ధతో రాధ పెంచుచుండగా నా బాలుడు మహావైభవముతో పెరుగుచుండెను. అతని బలపరాక్రమములు గూడ అసమానములు. అది మొదలుకొని యామెకు క్రమముగా ననేకులు ఔరస పుత్రులు జనించిరి.

"వసు (సువర్ణ) కవచకుండలములు గలవాడగుటచేత నా బాలకునకు బ్రాహ్మణులు 'వసుషేణుడు' అని నామకరణము చేసిరి. ఈ విధముగా నా బాలకుడు 'సూతపుత్రుడు'గా వ్యవహరింపబడెను. అతనికి 'వృషుడు' అని మరియొక పేరుగూడ నుండెను. సేవకులను కుంతీదేవి అన్ని ప్రాంతములకు పంపి, అధిరథుని యింటి యందు సువర్ణ కవచకుండలధారియగు బాలుడు పెరుగుచున్నాడని తెలిసికొని 'తన పుత్రుడు సుఖముగా నున్నా'డనుకొని తృప్తి, ఆనందము చెందెను.

"పెరిగి పెద్దవాడైన వసుషేణుని అతిరథుడు హస్తినాపురమునకు పంపె. అక్కడ ధనుర్వేదాచార్యుడగు ద్రోణాచార్యుని వద్ద శిష్యునిగా చేర్చెను. వసుషేణునకు అక్కడ సహాధ్యాయిగా నున్న దుర్యోధనునితో అప్పుడు మైత్రి యేర్పడెను. ఆ బాలకుడు, ద్రోణాచార్య-కృపాచార్యుల వద్దను, పరశురాముని వద్దను విద్యాభ్యాసము చేసి నాల్గు విధములైన అస్త్రవిద్యా విశేషములను సమగ్రముగా నేర్చెను. ప్రపంచమునందు ఒక గొప్ప ధనుర్విద్యా విశారదుడుగా పేరొందెను.

"వసుషేణుడు దుర్యోధనుని చెలిమివలన, పాండవులకు అపకారము చేయుటయందు ఆసక్తి కలిగి యుండెను. అర్జునునితో పోరాడుటకు సర్వదా కోరుచుండెను. కర్ణార్జునులు పరస్పరము చూచుకొనినప్పటినుండియే పోటీ పడుచుండిరి.

జనమేజయ మహారాజా! కర్ణునితో సూర్యుడు ప్రసంగించినప్పుడు 'ఒక రహస్యమున్నది' అన్న విషయమిదియే. అట్లు సహజ కవచ కుండల శోభితుడైయున్న కర్ణునిచూచి యుధిష్ఠిరుడు "యుద్ధమునందు ఇతని వధించుట సాధ్యముకాదు" అని లోలోన పరితపించెను. కర్ణుడు మహాదాత. అతడు మధ్యాహ్నకాలమున జలమునందు నిలిచి యంజలిబద్ధుడై సూర్యుని స్తుతించునపుడు, బ్రాహ్మణులు ధనమును యాచించుటకై సమీపించెదరు. ఆ సమయమునందు వారు ఏమి అడిగినను లేదనకుండ నిచ్చుచుండును. అతని దృష్టియందు ఇవ్వదగని వస్తువనునది లేదు

## ఇంద్రాగమనము

" జనమేజయా! ఒకనాడు ఇంద్రుడు గూడ బ్రాహ్మణ వేషముతో 'భిక్షాందేహి' అనుచు వచ్చెను. రాధేయు డతనికి స్వాగతము చెప్పి, యింద్రుడని తెలియక 'విప్రోత్తమా! నీకేమి కావలెనో కోరుకొనుము. సువర్ణ కంఠహారములు గల యువతులా? అనేక గోసంపత్తిగల గ్రామములా?' అని యతని నడిగెను. ఆ మాటకు ఇంద్రుడు కర్ణునితో 'వీరవర్యా! నీవు ఇప్పుడు చెప్పినవి కానీ, అంతకన్న ప్రియమైన వస్తువులు కానీ, అవి యేవియు నాకు అక్కరలేదు. వాటిని ఇతర యాచకులకు ఇమ్ము. నీవు సత్యవ్రతముగల వాడవే యైనచో నీకవచ కుండలములను శరీరమునుండి ఒలిచి యిమ్ము. ఇదియే అన్నిటి కన్న నాకు ఇష్టమైన వస్తువు. అని యనెను. ఆ మాటకు కర్ణుడు ఆ బ్రాహ్మణ వేషధారియైన యింద్రునితో 'భూమి, స్త్రీలు, గోవులు, అనేక సంవత్సరముల వరకు నీవు అనుభవించదగిన జీవనవృత్తి, మరియేదియైనను కోరుకొనుము ఇచ్చెదను. కాని, కవచ కుండలములను మాత్రము ఈయను.' అనెను.

" జనమేజయా! ఈ విధముగా అనేక వస్తువులను ఇచ్చెద ననియు, ఎన్నియో ఉపాయముల ద్వారా అతనిని కవచకుండలములకు విముఖుని చేయ దలచియు కర్ణుడు విఫల ప్రయత్నుడయ్యెను. ఇంద్రుడు అవిదప్ప ఇతరవస్తువు లేవియు నాకు అక్కర లేదనెను. అప్పుడు కర్ణుడు, 'బ్రాహ్మణోత్తమా! ఈ కవచ కుండలములు అమృతమునుండి పుట్టినవి. ఇవి నాతో పాటే నా శరీరమునకు అంటుకొని పుట్టినవి. వీటి చేత నేను లోకమునందు ఎవరికిని వధ్యుడనుకాను. కనుక వీటిని నేను విడువజాలను. అతి విశాలము, శత్రుబాధారహితము నైన నారాజ్యమును తీసుకొనుము ఇచ్చెదను. కవచ కుండలములు లేని నేను తప్పక శత్రువులచేత వధింపబడెదను. కనుక ఈయను' అనియనెను.

" ఇంద్రుడు మరియే యితర వస్తువులను కోరకుండ మొండి పట్టుదలతో నున్నప్పుడు కర్ణుడు నవ్వి యిట్లనెను: —

(సశేషము)

# చేనేతకు చేయూత

( 10 వ పుట నుండి )

రంగానికి చెందిందని చేనేతకు సంబంధం లేదనే వాదన సక్రమమైందికాదు. ఒక నూలు మిల్లులో ఎంత నూలు తయారు చేయగలుగుతామో, అంతే నూలు 25% ఖర్చుతో సిల్కు మనం తీయగలుగుతున్నాం. రూ 4 కోట్లతో మిల్లు 5 సంవత్సరాలలో ఎంత ఉత్పత్తిని ఇస్తుందో అంతే ఉత్పత్తి ఆరు మాసాలలో 1 కోటి రూపాయలతో ఇవ్వగలుగుతాం. నేత పనివారి వేతనాలు కూడా మూడింతలు పెరిగే అవకాశంవుంది. ప్రభుత్వం రాయలసీమ బోర్డువారు కలిసి ఒక కోటి రూపాయలు సిల్కు పరిశ్రమాభివృద్ధికి కేటాయించారు. ఇటు పంచాయితీరాజ్‌వారు, అటు అటవీశాఖవారు తమ పూర్తి మద్దతునిస్తున్నారు. కేంద్ర ప్రభుత్వం వారి యాజమాన్యంలో ఒక శిక్షణకేంద్రం—మన రాష్ట్రానికి మరొక గ్రుడ్ల తయారీ కేంద్రాలు అప్పుడే పనిచేస్తున్నాయి. నిరుద్యోగులైన విద్యావంతులకు హైద్రాబాదు చుట్టుప్రక్కల మూడెకరాల చొప్పున భూమిని కేటాయించారు. చేనేత కుటుంబాల విద్యావంతులు, వ్యవసాయకులు ఈ అవకాశాన్ని బాగా వినియోగించుకోవాలని అర్థిస్తున్నాను.

ఇప్పుడు మనకున్న మగ్గాలు చాలా తక్కువ ఉత్పత్తిని యిస్తున్నాయి కాబట్టి నూతనమైన ఎక్కువ ఉత్పత్తినిచ్చే 5,000 మగ్గాలను త్వరత్వరగా చేయించి పెట్టాలని పరిశ్రమ శాఖ డైరెక్టరు గారిని కోరడం జరిగింది.

ఈ సంవత్సరం మనవద్ద చేనేత వస్త్ర నిలువలు పేరుకొని పోయాయి. మన ప్రభుత్వ డిపార్టుమెంట్లు తప్పనిసరిగా ఈ వస్త్రాన్నే కొనాలని ఖచ్చితమైన ఆదేశాలనిస్తున్నాము. ఇండస్ట్రియల్ లేబరు, మరి ఇతర నికరాదాయ వర్గాలకు 6 మాసాల అరువుమీద చేనేత నిలువలనుండి ఇవ్వాలని ఒక పథకాన్ని కార్మిక శాఖామాత్యులు రూపొందిస్తున్నారు.

దక్షిణ రాష్ట్రాలైన ఆంధ్ర, కర్ణాటక, కేరళ, తమిళనాడు చేనేత శాఖా మాత్యులను మన ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు గారు జనవరి నెలలో సమావేశపరిచారు. ఆయనే అధ్యక్షత వహించి అమూల్యమైన ఎన్నో నిర్ణయాలను తీసుకొని భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ పద్దకు ఒక డెలిగేషను పంపారు. ఆంధ్రరాష్ట్రం దానికి కన్వీనరుగా వున్నది. దక్షిణ రాష్ట్రాలలో పేరుకొని పోయిన నిల్వలను విడుదలచేసి పరిశ్రమను చేనేత పరిశ్రమ పరిస్థితిని మరింత పటిష్ఠము చేయాలని మన వాదన కేంద్ర ప్రభుత్వం నాలుగుకోట్ల రూపాయలు మనకు మంజూరు చేసినది. దానిలో ఆంధ్ర రాష్ట్ర వాటా కోటి 20 లక్షలు, దక్షిణాది చేనేత పారిశ్రామికులు మన ప్రధానికెంతో ఋణపడి వున్నారు. ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ తీసుకొన్న చరిత్రాత్మకమైన ఈ నిర్ణయం మనం గతంలో పోగొట్టుకున్న గౌరవాన్ని, టెక్స్‌టైల్ యిండస్ట్రీలో మన న్యాయమైన వాటాని సంపాదించి పెట్టిందని నేను పూర్తిగా విశ్వసిస్తున్నాను. దానిని ఉపయోగించు కోవడమే ఇక మన కర్తవ్యం.

(1975 జులై 9 వ తేదీన రేడియో ప్రసంగం)

---

( చిత్రవాణి 13వ పుట నుండి )

మొదలగు శాఖల అధికారులు—వ్యవసాయ విశ్వవిద్యాలయాలకు చెందిన శాస్త్రవేత్తలు, నిపుణుల సాయంతోను, టెలివిజను విభాగంవారు రూపొందిస్తున్నారు. ఇందుకుగాను హైద్రాబాదు, కటక్ ఢిల్లీలలో స్టూడియోలను నెలకొల్పారు. హైద్రాబాదు కేంద్రంలో ఆంధ్రప్రదేశ్‌కు, కర్నాటకకు—అవసరమైన కార్యక్రమాలను రూపొందిస్తున్నారు.

# గ్రంథసమీక్ష

## బాల వ్యాకరణ సంజ్ఞా చంద్రిక

రచయిత్రి : భాషా ప్రవీణ శ్రీమతి గూడపాటి కృష్ణకుమారి.

వెల రూ 4 లు

(ప్రతులు లభించుచోటు : నవ భారతి, లంకవీధి, విజయనగరం )

ఆంధ్రభాషకు గల వ్యాకరణములలో నెల్ల ప్రశస్తము శాస్త్రీయము, బహుప్రచారము అయినది శ్రీపరవస్తు చిన్నయసూరి గారు రచించిన బాల వ్యాకరణము. బాల వ్యాకరణము అను పేరున్నను అది విద్వదేకవేద్యమైనట్టిది. సూరి పాణినీయ వ్యాకరణమున నిష్ణాతుడై, దానినే ఒజ్జబంతిగా గైకొని, అందలి పారిభాషిక పదములనే వాడుచు శాస్త్రీయము, ధారణా యోగ్యము, శ్రుతి సుభగము అయిన చక్కని సూత్రబంధముతో బాల వ్యాకరణమును రచించి విద్వద్వంద్యుడయ్యెను. అందలి పారిభాషిక పదములను, ప్రత్యాహార విధానమును సమగ్రముగా అవగాహనము చేసికొన్న వారికి కాని అందలి సూత్రములు సరిగా బోధపడవు. బాల వ్యాకరణమునకు పెక్కు వ్యాఖ్యానములు వెలసినవి. వానిని పూర్తిగా చదువుటకు కాని బహువివరములతో గూడిన యందు డి పారిభాషిక పదముల అర్థమును గ్రహించుటకు కాని తగిన ఓపిక పలువురి కుండదు. ఆ విషయము గ్రహించి శ్రీమతి కృష్ణకుమారిగారు పారిభాషిక సంజ్ఞా పదములనన్నింటి నేరి వానికీ గ్రంథమున సర్వసుబోధమైన వివరణము నొసంగియున్నారు. పెక్కుచోట్ల వారి వివరణము అతి విస్తృతముకాని, అతి సంక్షిప్తము కాని కాక యథావశ్యకమై విద్యార్థి జన బహూపకారకమై ఉన్నది. వారు కావించిన సూత్రోదాహరణ సమన్వయము ప్రశంసా పాత్రము. వారు సిద్ధాంత కౌముది, సూత్రాంధ్ర వ్యాకరణము, శబ్దానుశాసనము, శబ్దలక్షణ సంగ్రహము మున్నగు వాని నుండి కూడ నవసరమైన చోట్ల నిర్వచనము లొసంగి సిద్ధాంతములు ప్రదర్శించి తమ వివరణమునకు ప్రామాణ్యము కలిగించియున్నారు. బాల వ్యాకరణము చదువగోరు వారికినీ, అందు పరీక్షల నిచ్చు విద్యార్థులకును ఈ చంద్రిక వెలుగు బాట చూపుననుటలో సందేహములేదు.

అచ్చు, హల్లు అను సంజ్ఞలకు వివరణ మొసంగునపుడు మహేశ్వర సూత్రములను, ఆప్రత్యాహారములను ప్రదర్శించి చూపుట ఉచితముగా నుండి యుండెడిది. (పుట6)తావు, తవర మొదలగు వర్గయుగక్షరములనుటకంటె వర్గయుక్కులతో కూడిన పదము లనుట లెస్స. (పుట12) చజల తుల్యములు అనుచో చజలతో తుల్యములని యుండుట మంచిది. "దంత్యచకారజకారములు తాలవ్య చకార జకారార్థముల నిచ్చునని భావము" అను వాక్యమును తొలగించుటయే ఉచితము. వర్తమాన భూత భవిష్యదర్థకములను వివరించుచోట 'ప్రతియోగి' పదమును కూడ విశదీకరించి యుండవలసినది. మొత్తము మీద అచ్చటి వివరణ మత్యంత సంక్షిప్తముగా నున్నది.

నిరవకాశము, గతి సంజ్ఞాకము (అగతికము) ; గత్యర్థకము; అనభిహితకర్త ; అభ్యాతము; స్త్రీవాచకము, స్త్రీతుల్యము, ముఖ్యాముఖ్య కర్మములు; త్వార్థము మున్నగు సంజ్ఞలను కూడ నిందుచేర్చి యుండవలసినది.

గ్రంథమా ృతిని చిన్నదయ్యు ఉపయోగమును బట్టి మిన్నగా నున్నది. గౌ. శ్రీ. భాట్టం శ్రీరామ మూర్తి దంపతు లీ కృతిని గ్రహించుటచే పసిడికి పరిమళమబ్బినది.

—దివాకర్ల వేంకటావధాని

## జీవనహేల

### (కవితా సంకలనం)

రచయిత : సుబ్రహ్మణ్యం 'రంగినేని'

ప్రచురణ :నవోదయ సాహితీసమితి, కొల్లాపురం

62 పేజీలు వెల : 2-50

ఊహాలోకాల్లో ఊయలలూగే కవులు, స్థిరమైన ఆశయంతో ప్రయోజనవంతమైన సామాజిక చైతన్యం లక్ష్యంగా వుండేకవులు, ఈ రెండు రకాల కవులూ ఈరోజు వున్నారు. అయితే తటస్థ విధానం అవలంబించి అటోకాలు, ఇటోకాలు వేసి—కవిత్వం అంటే మనోభావచాంచల్యం అన్నట్లుగా అన్నిరకాలుగా, 'ఎప్పటి కెయ్యది ...' అన్నట్లుగా రచన సాగించే వారూ వున్నారు.

తన జీవనహేల సంపుటి గురించి రంగినేని ఇలా వ్రాసుకున్నారు. 'పల్లవించిన నా హృదయం పలికిన సరిత్తుల్లాంటి నా భావాలు వర్తమానాన్ని దాటుకుంటూ భవిష్యత్తులో బ్రతికి బట్టగడుతాయన్న నా నమ్మకాన్ని వమ్ముచేయక వాస్తవరూపంతో అచ్చుపోసుకోవడం, అచ్చులో అక్షర విన్యాసాల చూచి విన్యాసాల్లోని వింత పలకరింతను కనులారా గాంచి హృదయం ఆనందలాస్యాలు చేయడం నా మహద్భాగ్యం కాదా మరి ! ?"

అచ్చులో కవిత్వం చూసుకుని ఆనందించడం, కవిత్వరచన వల్ల ఆత్మానందమూ, మాత్రమే ఆశయసాధనంగా, మహద్భాగ్యంగా భావించేస్థితి నుంచి మనకవులు ఎదగాలి.

రంగినేని 'జీవనహేల'గా సంకలించిన 27 ఖండికలలో కొన్ని భావకవితలు, కొన్ని ఆత్మాశ్రయాలు, కొన్ని ప్రేమగీతాలు, అక్కడక్కడ సామాజిక స్పృహ తొంగిచూస్తుంది.

"చిన్న వయసులో, కవితా సృష్టికై ఎంతో ఆవేగంతో, మరెంతో ఆవేశంతో కలాన్నికదిలించే యువకవిలో" అనేక ముఖ

లుండడం, "ఆలోచనా వైవిధ్యంనుండి తన్నుతాను తప్పించుకోలేక పోవడం," సహజమే నంటూ డా. నాయని కృష్ణకుమారిగారు "కవితాదర్శంలో స్థిరత్వం తెచ్చుకోమని ఒకరు చెప్పవలసిన అవసరమేముంది? వయస్సు గడిచిన కొద్దీ అవశ్యమూ అలవడే లక్షణమే అది" అని రేఖాచిత్రం వ్రాస్తూ అన్నారు.

పాతికేళ్ళ వయస్సు గడుస్తున్న సుబ్రహ్మణ్యం రంగినేని లోని స్థిరమైన కవిత్వ ఆశయం, రచనాదర్శం రాబోయే సంకలనాలలోనైనా స్పష్టం కాగలదని మనమూ ఆశిద్దాం. గాయపడ్డ హృదయాల్ని చదవడం స్పందనగా గల కవి, గేయకల్పనకు స్వీయవేదనలోని లోతుల్లో విహరించక ఇకపై బాధితుల సామూహిక చైతన్యోద్దీపనకై సామాజిక స్పృహతో రచనాదర్శాన్ని ఏర్పరుచుకోగలరని ఆకాంక్షిద్దాం.

—సుధామ

# సిరి, చుక్క, మొగ్గ

## (బాలగేయాల సంపుటి)

రచన : శ్రీ తాడి వెంకటకృష్ణారావు

ప్రచురణ : శశిశ్రీ పబ్లికేషన్స్, హుమాయూన్ నగర్

హైద్రాబాద్-28

పేజీలు 61 వెల : రూ. 4 లు

శ్రీ వెంకట కృష్ణారావు రచనలో బాలగేయాల లక్షణాలు చక్కగా సమకూడాయి. ఒకటి గేయం నడక, రెండోది బాల పరిభాషకు అనువైన పదగుంభనం, మూడోది బాలలకు తేలిగ్గా జ్ఞాపకం ఉంచుకోదగినట్లు వివిధ విషయాల క్రోడీకరణ.

ఈ మూడు గుణాలతో కూడిన 60 బాలగేయ ఖండికల సంపుటి ఇది.

మొదటి లక్షణానికి ఏ గేయమైనా ఉదాహరణమే—మచ్చుకు—"తెల్లని మేఘం తేలుచుండగా అంబరమెంతో అందం అందం; నల్లని మబ్బులు నాట్యమాడగా తెల్లని చంద్రుడు అందం అందం".

రెండో లక్షణం క్రింద చిన్న మాటలతో బాలల మనోవికాసానికి ఒక కవితా స్వరూపం కల్పించడం మంచి గుణం. దానికి ఉదాహరణలుగా—"ఎర్రపూవు సూర్యుడంట, తెల్లపూవు చంద్రుడంట. ఆకసమే చెట్టేమో, పూలు రెండు పూచెనేమొ" ; "పెద్దలనీ పేరుపొంది గ్రద్దలవలె తిరుగుటేల? పిన్నలవలె నున్ననేమి పన్నీరును చిలుకుటకై? రాబందులన్నికూడ రాచిలుక లైననాడు రామరాజ్య మీయుగమై మరపించును కలియుగమే" ; "ప్రకృతిలో నా చిత్రంబేమో పాముకు పక్షికి పడనే పడదు, పక్షిని మ్రింగా పాము చూచును, పామంటే పగ పక్షికి ఎంతో, చెట్టు చిటారున చేరిన పక్షికి పామంటేనే పగలేదసలు, చెట్టు చెంతగల పుట్లో పాముకు పక్షి యన్నచో ప్రేమే ఎంతో, పక్షీ పామూ చెంత చెంతనే కలసీ మెలసీ కాపురమున్నవి!" ఇలా సద్గుణాలనూ, సామ్యవాదాన్నీ సహజీవనాన్నీ రచయిత ముద్దు ముద్దుగా ప్రబోధించాడు. ఇక, మూడో లక్షణం చూస్తే పెద్దబాల శిక్ష పద్ధతి జ్ఞాపకం వస్తుంది. జ్ఞాపకం ఉంచుకోదగిన అనేక విశేషాల్ని ఒక్క చోట గుదిగుచ్చి చెప్పే వైఖరి అది. మచ్చుకు—"గోలుకొండ, పెనుగొండ, కొండవీడు, పలనాడు, ఓరుగల్లు, పానుగల్లు, అమరావతి, రాజమండ్రి, శ్రీకాకుళం, చంద్రగిరి, బొబ్బిలి, విజయనగరం, తెలుగురాజ్య వైభవాలు! తెలుసుకుంటె భాగ్యమౌను!" ఇలా ఆధునిక చరిత్ర, విజ్ఞాన విషయాలూ చాలా గేయాల్లో గుదిగుచ్చాడు రచయిత. దీనికితోడు గాంధీ, బుద్ధుల జీవిత కథలుకూడా గేయ పద్ధతిలో చెప్పాడు.

"అందమైన పెద్దమేడ అమ్మా మనకుందిగదే, అందర్నీ రమ్మంటూ అందర్నీ ఉండమనవే" అంటూ చిన్న ఊహలో సోషలిస్టు దృక్పథాన్ని వెల్లడించడం అభినందనార్హం.

"పిల్లల పాటలైనా ఈ రచయిత కవితా కణాలను పుష్కలంగా అందిస్తూ మామూలుగా పిల్లల పాటల్లో కనిపించని ప్రగతి దృక్పథాన్ని ప్రవేశపెట్టారు" —అంటూ డాక్టర్ సి. నారాయణరెడ్డి, "ఒక స్పష్టమైన హేతు బద్ధమైన వస్తువును తేలిక పదాలతో సాహిత్యంలోకి మలిపి భావిపౌరులైన బాలల కందించడం ఉత్తమ సాహితీ కృషి" అని శ్రీ బోయి భీమన్న మెచ్చుకున్న రచయిత శ్రీ తాడి వెంకట కృష్ణారావు.

ఏ పుట్టలో ఏపాముంటుందో అన్న పద్ధతిని శ్రీ కృష్ణారావు రచన కొబ్బరి నీరులా, కనబడకుండా వీచేగాలిలా, ఆకాశంలో ఇంద్ర ధనుస్సులా ఈ విప్లవ యుగంలో చిత్ర రుచులు వెలార్చింది.

పి. ఎస్. ఆర్.



చిన్న రైతుల అభివృద్ధి సంస్థ ప్రాజెక్టు అధికారి శ్రీ కె. ఎస్. శర్మ, శ్రీకాకుళంలోని ఆంధ్రాబ్యాంకు కు చెందిన గ్రామీణ ఋణ విషయాల అధికారి శ్రీ సి. వెంకటేశం గార్లు జూలై 6వ తేదీన శ్రీ కాకుళం జిల్లా, కాశీ బుగ్గ పంచాయతీ సమితికి చెందిన హుకుం పేట గ్రామంలో 138 మంది మత్స్య పారిశ్రామికులకు లక్ష రూపాయల విలువగల నైలాను దారాలను పంపిణీ చేశారు.



ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు శ్రీ ఎస్. ఓబులరెడ్డి జూలై 27న వరంగల్లులో ప్రభుత్వ ఆసుపత్రిని సందర్శించారు.

# జిల్లాల్లో వార్తా చిత్రాలు



ఆంధ్ర ప్రదేశ్ శాసన సభ స్పీకర్ శ్రీ రేబాల దశరథ రామరెడ్డి జూన్ 26 న నెలూరు జిల్లా బుచ్చిరెడ్డి పాలెం పంచాయతీ సమితికి చెందిన ఉత్తర మోపూరు గ్రామంలో పరిచెర్ల రాఘవరెడ్డి స్మారక అప్పర్ ప్రైమరీ పాఠశాలకు ప్రారంభోత్సవం చేశారు. విద్యామంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తిని కూడా యీ చిత్రంలో చూడ వచ్చు.



పశ్చిమ గోదావరి జిల్లా పెదపాడు పంచాయతీ సమితిలో సామూహిక వరి నారుమళ్ళ క్షేత్రం.



ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు శ్రీ ఎస్. ఓబులరెడ్డి జూలై 16న అమీర్ పేటలో గల సేవా గృహాన్ని సందర్శించారు. మహిళా సంక్షేమ శాఖ మంత్రి శ్రీమతి ఎం. లక్ష్మీదేవిని కూడా చిత్రంలో చూడవచ్చు.



కేంద్ర న్యాయ, కంపెనీ విషయాల స్టేట్ మంత్రి శ్రీమతి సరోజినీ మహిషి కేంద్ర న్యాయ చట్టాలను ప్రాంతీయ భాషలలోకి అనువదించే పని ఎంత వరకు వచ్చిందీ అనే విషయంపై జూలై 10న సచివాలయంలో అధికారులతో చర్చలు జరిపారు. రాష్ట్ర మంత్రులు శ్రీయుతులు ఎం. వి. కృష్ణారావు. ఆసిఫ్ పాషాలను కూడా చిత్రంలో చూడవచ్చు.

పరిశ్రమల మంత్రి శ్రీ పి. బసిరెడ్డి హైదరాబాదులో జూలై 28న పరిశ్రమల అభివృద్ధికి ఉద్దేశించిన తీవ్రతర ఉద్యమానికి ప్రారంభోత్సవం చేశారు. హైదరాబాదు జిల్లా పరిషత్తు ఛైర్మన్ శ్రీ యం. భోజిరెడ్డిని కూడా యీ చిత్రంలో చూడవచ్చు.



మద్రాసులోని రష్యా కౌన్సల్ జనరల్ శ్రీ వి. ఎం. కోషలేవ్ జూలై 16న హైదరాబాదులో ఆంధ్ర ప్రదేశ్ శాసన మండలి ఛైర్మన్ శ్రీ ఎన్. వెంకటసుబ్బయ్యను కలుసుకున్నారు.



యజమానుల, కార్మిక సంఘాల ప్రతినిధులు యిటీవల సచివాలయంలోని కమిటీ హాలులో కార్మిక మంత్రి శ్రీ టి. అంజయ్య అధ్యక్షతన సమావేశమై ప్రధాని 20 అంశాల ఆర్థిక కార్యక్రమానికి మద్దతు ప్రకటించారు.



# జిల్లాల్లో..

## గుంటూరు జిల్లాలో రైతులకు ఎరువుల పంపిణీ

రెవిన్యూశాఖ మంత్రి శ్రీ పి నరసారెడ్డి, గుంటూరుజిల్లా సీతానగరంలో జూలై 8న ఒక సమావేశంలో డినోటిఫైడ్ గిరిజనులకు రు .00లు విలువచేసే ఎరువులను పంపిణీచేస్తూ ఎరువులను సక్రమంగా వినియోగించుకోవాలని రైతులకు విజ్ఞప్తి చేశారు.

సమావేశానికి అధ్యక్షత వహించిన జిల్లా కలక్టరు శ్రీ కె చంద్రయ్య ప్రసంగిస్తూ చిన్నతరహా పరిశ్రమలు, యితర చేతి పరిశ్రమలు ప్రారంభించడానికి గిరిజనులకు సౌకర్యాలు కల్పించబడ్తాయని హామీ యిచ్చారు

## ఏలూరులో పెరటి తోటల పెంపకం

ఏలూరు పట్టణంలో పెరటితోటలను ప్రోత్సహించడానికి వ్యవసాయశాఖ ఒక పథకాన్ని రూపొందించింది. పెరటితోటలు పెంచడానికి యిష్టంవుండేవారు ఈ పథకంలో సభ్యులుగా చేరవచ్చు పట్టణానికి కొన్ని విభాగాలుగా చేయడం జరిగింది. ఒక్కొక్క విభాగం ఒక్కొక్క అసిస్టెంటు అగ్రికల్చర్ ఆఫీసర్ పర్యవేక్షణలో వుంటుంది.

సభ్యులకు కావలసిన కూరగాయల విత్తనాలు, రసాయనిక ఎరువులు సరసమైన ధరలకు లభిస్తాయి. మొక్కల తెగుళ్లను అరికట్టేందుకు క్రిమిసంహారక మందులు కూడా సరఫరా చేయబడుతాయి. వారికి యితర సాంకేతిక సహాయం కూడా లభిస్తుంది.

## జర్నలిస్టుల యిండ్ల నిర్మాణ సంస్థకు స్థలం

వరంగల్లు జిల్లా కలక్టరు శ్రీ ఎం.బి. బాలరాజ్, జూలై 17న దుర్గేశ్వర దేవాలయంలో ప్రత్యేకంగా జరిగిన ఉత్సవంలో జర్నలిస్టుల యిండ్ల నిర్మాణసంస్థకు మూడు ఎకరాల ప్రభుత్వ భూమిని అందజేశారు. సంఘ సభ్యుల సమావేశంలో కలక్టరు ప్రసంగిస్తూ జర్నలిస్టుల సమస్యలను సమగ్రంగా పరిశీలించి, నిర్మాణాత్మకమైన సూచనలను చేయాలని కలక్టరు అన్నారు. ఈ కాలనీ త్వరలో నిర్మించబడుతుందనే ఆశాభావాన్ని ఆయన వ్యక్తం చేశారు. ఉత్సవానికి అధ్యక్షత వహించిన ఆంధ్రప్రదేశ్ వర్కింగ్ జర్నలిస్టుల సంఘం అధ్యక్షులు శ్రీ బి. నాగేశ్వరరావు ప్రసంగిస్తూ వరంగల్లులో విద్యావిస్తరణ త్వరితగతిని జరుగుతున్న దృష్ట్యా యిక్కడి నుండి ఒక దినపత్రిక ప్రచురించబడాల్సిన అవసరం ఉందని అన్నారు. అనేక జిల్లాలలో జర్నలిస్టుల కాలనీలు తయారవుతున్నాయి.

## కోన బ్లాకు నీటిసరఫరా పథకానికి శంకుస్థాపన

ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు బందరు, దివి తాలుకాలకు మేలు చేకూర్చే కోన బ్లాకు నీటిసరఫరా పథకానికి శంకుస్థాపన చేశారు. ఈ పథకం క్రింద హరిజనులకు, వెనుకబడిన వర్గాల వారికి ఎక్కువ ప్రయోజనం కలుగుతుంది. ఈ సందర్భంగా జరిగిన సభకు అధ్యక్షత వహించిన మీడియం ఇరిగేషన్‌మంత్రి శ్రీ వి కృష్ణమూర్తి నాయుడు మాట్లాడుతూ కోనబ్లాకు పథకం అమలుకు రూ. 17 లక్షలు, కరకట్ట నిర్మాణానికి రూ. 9 లక్షలు వ్యయం కాగలదని, దీనివలన 7,560 ఎకరాల భూమి అదనంగా సాగులోనికి రాగలదనీ, ఏటా రూ 76 లక్షలు విలువ గల పంట అదనంగా ఉత్పత్తి కాగలదని తెలిపారు

## స్టూవర్టుపురం నివాసులకు భూమి, యిరిగేషన్ సౌకర్యాలు

స్టూవర్టుపురం సెటిల్‌మెంటు నివాసులకు రెవిన్యూమంత్రి శ్రీ పి. నరసారెడ్డి యిటీవల ఎరువులు పంపిణీచేశారు. స్టూవర్టుపురం సెటిల్‌మెంటు యువజనబృందం ఏర్పాటు చేసిన గాంధీ ప్రదర్శనను మంత్రి ప్రారంభించారు.

ఇక్కడ నివాసం ఏర్పాటు చేసుకున్నవారికి ప్రభుత్వం రూ. 2.50 లక్షలు ఖర్చుచేసింది. 146 కుటుంబాలకు భూమి, యిరిగేషన్ సౌకర్యాలను కల్పించింది. ప్రభుత్వం గిరిజనులకు అట్టడుగున వున్నవారికి లాభించే పథకాలకు ఎంత సొమ్మయినా ఖర్చు చేస్తుందని మంత్రి అన్నారు.

విద్య, సాంస్కృతికశాఖ మంత్రి యీ సందర్భంలో జరిగిన సభకు అధ్యక్షత వహిస్తూ ప్రభుత్వం 18నెలల క్రిందట ప్రారంభించిన కార్యక్రమం విప్లవాత్మకమైన మార్పులను తెచ్చిందన్నారు. స్టూవర్టుపురం సెటిల్‌మెంటు పేరును వచ్చే అక్టోబరు 2 నుండి గాంధీపురంగా మారుస్తున్నట్లు తెలియజేశారు. ఇక్కడ విద్యుచ్ఛక్తి సౌకర్యాలు కూడా కల్పించనున్నట్లు ప్రకటించారు.

## బి.హెచ్.ఇ.ఎల్. పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం

మెదక్ జిల్లా రామచంద్రాపురం వద్ద రూ. 7.5 లక్షల ఖర్చుతో నిర్మించిన భారత హెవీ ఎలక్ట్రికల్స్ హైస్కూలు భవనానికి ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు జూలై 19న ప్రారంభోత్సవం చేశారు.

భారత హెవీ ఎలక్ట్రికల్స్ సంస్థవారు ఈ భవనాన్ని మెదక్ జిల్లా పరిషత్‌కు విరాళంగా యిచ్చారు. ఈ సందర్భంగా జరిగిన ఒక సభలో ప్రసంగిస్తూ ముఖ్యమంత్రి క్రమశిక్షణ లేకపోతే దేశం అభివృద్ధి సాధించలేదని అన్నారు. బి.హెచ్.ఇ.ఎల్ జనరల్ మేనేజర్ శ్రీ ఆర్. నాయుడు అధ్యక్షత వహించారు. జిల్లా పరిషత్ ఛైర్మన్ శ్రీ నరసింహారెడ్డి, జిల్లా కలెక్టర్ శ్రీ మొహ

మ్మద్ అలీ, రాష్ట్ర పారిశ్రామిక సంస్థ ఛైర్మన్ శ్రీ ఎన్. రామచంద్రారెడ్డి ప్రభృతులు ప్రసంగించారు.

## నాగార్జునసాగర్‌లో గైడ్స్ ట్రైనింగ్ కోర్సు

ఆంధ్రప్రదేశ్ విహారయాత్రలశాఖ ఆధ్వర్యంలో నాగార్జున సాగర్‌లో నిర్వహిస్తున్న గైడ్స్ ట్రైనింగ్ కోర్సును రాష్ట్ర విహారయాత్రశాఖ మంత్రి శ్రీ సి హెచ్. దేవానందరావు ప్రారంభించారు.

ఈ సందర్భంలో ఆయన విహారయాత్ర శాఖ ప్రాధాన్యాన్ని వివరిస్తూ, దేశ విదేశమారక ద్రవ్యపరిస్థితి మెరుగుపరచడానికి విహార యాత్రా స్థలాలు ప్రాధాన్యత వహిస్తాయన్నారు. 1967లో దీనివల్ల దాదాపు రూ. 25 కోట్లు ఆదాయం లభించింది. క్రమేణా అభివృద్ధిచెందుతూ 1974 నాటికి రూ. 75 కోట్ల ఆదాయాన్ని సంపాదించిన దృష్ట్యా విహారయాత్రా స్థలాల అభివృద్ధిని మెరుగుపరచడానికి ప్రభుత్వం ఆలోచిస్తున్నదని మంత్రి అన్నారు. యాత్రికులను ఆకర్షించేందుకు వారికి రవాణా వసతి సదుపాయాలను గైడ్సు సౌకర్యాన్ని కల్పించడం ప్రాధాన్యత వహిస్తాయని అన్నారు

భారత పురావస్తుశాఖ అధికారి శ్రీ నాయనార్, నాగార్జున సాగర్ ప్రాజెక్టు చీఫ్ ఇంజనీర్ శ్రీ డి బాలకృష్ణారెడ్డి, స్థానిక టూరిస్టు డెవెలప్‌మెంటు డిప్యూటీ డైరెక్టరు శ్రీ కమల్ ప్రసాద్ కమల్, రాష్ట్ర టూరిజంశాఖ డైరెక్టర్ శ్రీ మహారాజ్ కరణ్ ప్రభృతులు ప్రసంగించారు

## గుంటూరు జిల్లాలో ఉత్తమ పంచాయతీ

1974-75 సంవత్సరానికి గుంటూరు జిల్లాలో జగ్గాపురం పంచాయతీ అన్నిరంగాల్లో సాధించిన ప్రగతికి చిహ్నంగా అత్యుత్తమ పంచాయతీగా ఎంపిక చేయబడింది ఈ పంచాయతీ అధ్యక్షులు శ్రీ ఎం. శివప్రసాద్.

పంచాయతీ సాధించిన అభివృద్ధిని క్రోడీకరిస్తూ శ్రీ శివప్రసాద్ యీ పంచాయతీలో విద్యుచ్ఛక్తి సౌకర్యం కల్పింపబడిందనీ, రక్షిత నీటి సరఫరా పథకానికి కేటాయింపబడిన 85 వేల రూపాయలతో యీ కార్యక్రమం అప్పుడే పారంభమయిందని పని కొనసాగుతున్నదనీ, దీనికి ప్రజలు రూ. 8 500లు విరాళంగా యిచ్చారని అన్నారు. జగ్గాపురం పంచాయతీలో ఒక గ్రామీణ పశువుల ఆసుపత్రి స్థాపించబడింది. వ్యవసాయదారుడు శ్రీ హనుమంతరావు యీ ఆసుపత్రి కోసం 50 శాతం భూమిని విరాళంగా యిచ్చారు.

పంచాయతీ కార్యాలయభవనం, రూ 3500 వ్యయంతో తలపెట్టిన జగ్గాపురం-కారుబోల్డ్ రోడ్డు నిర్మాణం పూర్తయినాయి.

ఇరవై రెండు గృహాలతో ఒక హరిజనవాడ నిర్మింపబడింది. ఈ పంచాయతీలో ఫోను సౌకర్యం కల్పింపబడింది

## హైదరాబాద్ జిల్లాలో ఉత్తమ పంచాయతీ

హైదరాబాద్ జిల్లా కలెక్టరు శ్రీ యు. బి రాఘవేంద్రరావు అధ్యక్షత సమావేశమయిన జిల్లాస్థాయీ సంఘం ఇబ్రహీంపట్నంను ఉత్తమ గ్రామ పంచాయతీగా ఎంపిక చేసింది. 1973-74 సంవత్సరంలో యీ పంచాయతీ సాధించిన అభివృద్ధి కార్యక్రమాలకు గుర్తింపుగా యీ ఎంపిక చేయబడింది.

హైదరాబాద్ జిల్లాలో ఎనిమిది పంచాయతీ సమితుల్లోను 14 నోటిఫైడ్, 387 నాన్-నోటిఫైడ్ గ్రామపంచాయతీ లున్నాయి 1974-75 సంవత్సరానికి ప్రతీ సమితికి ఒక ఉత్తమ పంచాయతీని ఎంపిక చేసేందుకు మండలి స్థాయిలో ఒక్కొక్క సంఘం ఏర్పాటయింది.

ఇట్లా ఉత్తమంగా ఎంపిక చేయడిన పంచాయతీలు అల్వాల్, శంకరపల్లి, బోవరాంపేట, మల్కాజ్‌గిరి, శుభాన్ పూర్, పంచలింగాల్, మొహమ్మదాబాద్, బషీరాబాద్.

## గూడూరులో రక్తసేకరణ బ్యాంకు

ఆరోగ్య శాఖ మంత్రి శ్రీ కె. రాజమల్లు, రూ. 30,000ల ఖర్చుతో నిర్మించబడిన రక్తసేకరణ బ్యాంకుకు ప్రారంభోత్సవం చేస్తూ గ్రామీణ ప్రాంతాలలో వైద్య సదుపాయాలు కల్పించడానికి ఎక్కువ నిధులను కేటాయించాలని ప్రభుత్వం ఉద్దేశిస్తున్నదని అన్నారు. సమాజంలోని పేద వర్గాలకు సంతృప్తి కలిగించడానికి కష్టించి పని చేయాలని ఆరోగ్య సిబ్బందికి ఆయన విజ్ఞప్తి చేశారు. నేమిచందుదుగార్ కుటుంబం ఈ భవన నిర్మాణం పూర్తి ఖర్చును భరించిన కారణంగా యీ భవనాన్ని కీ. శే. నేమిచందుదుగార్ పేరుతో వ్యవహరిస్తున్నారు. శాసన సభ్యులు శ్రీ ఎన్. శ్రీనివాసులు రెడ్డి ఉత్సవానికి అధ్యక్షత వహించారు. కోట పంచాయతీ సమితిలోని టిక్కా అన్నారంలో రూ. 10,000ల ఖర్చుతో నిర్మించిన పంచాయతీ కార్యాలయానికి కూడా మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

## మోటార్ యింజన్‌తో నడిచే సైకిల్ రిక్షా

మోటారుతో నడిచే సైకిల్‌రిక్షాను యిటీవల విజయవాడ పి.డబ్ల్యు.డి. గ్రౌండ్సులో రాలీస్ యిండియా సంస్థవారు రాష్ట్ర పి.డబ్ల్యు డి. శాఖ మంత్రి శ్రీ చనుమోలు వెంకట్రావు సమక్షంలో ప్రదర్శించారు. మనిషి తొక్కనవసరంలేకుండా యీ మోటారుతో సైకిల్‌రిక్షా నడుస్తుంది. ఇంజనును ఏ రిక్షాకయినా సులభంగా అమర్చుకోవచ్చును సుమారు రూ. 1350 లు వ్యయమయ్యే ఈ యింజనులో లీటరు పెట్రోలు వేసి 50 కిలోమీటర్లు దూరం ప్రయాణం చేయవచ్చు.

మంత్రి శ్రీ వెంకట్రావు రిక్షాలో కూర్చుని కొంతదూరం వెళ్లి సైకిల్‌రిక్షాకు యీ మోటారుపద్ధతి చాలా బాగున్నదనీ, దీని వలన రిక్షా త్రొక్కేవారికీ, ఎక్కికూర్చొనేవారికీ కూడా శ్రమ తగ్గి ప్రయాణం సులభంగా సురక్షితంగా వేగంగా తక్కువ ధరకు జరుగుతుందని అన్నారు. రాలీస్‌సంస్థవారు కోరిన ఉపహాయింపులను ప్రభుత్వం సానుభూతితో పరిశీలిస్తుందని ఆయన హామీ యిచ్చారు.

## బలహీనవర్గాలకు ఇండ్లస్థలాలు

సమిశ్రగూడెం పంచాయతీ సమితిలోని కురుమూరుగ్రామంలోని అరుంధతీయులకు, వెనుకబడ్డ జాతులకు 48 ఇండ్లస్థలాలకు

పట్టాలు యివ్వబడినవి. ఈ పట్టాలను శాసనసభ్యులు శ్రీ సాలి వెంకట్రావు పంపిణీచేస్తూ బలహీనవర్గాలవారికి ప్రభుత్వంచేస్తున్న సహాయాన్ని వివరించారు. పంచాయతీసమితి అధ్యక్షులు శ్రీ ముళ్ళపూడి కృష్ణారావు, బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసర్ శ్రీ వి. నారదముని యీ ఉత్సవానికి హాజరయ్యారు.

## రేపల్లె తాలూకాలో బీదలకు పట్టాల పంపిణీ

రేపల్లెలో జరుగుతున్న జమాబందీ సందర్భంగా గుంటూరు జిల్లా కలెక్టర్ శ్రీ కె చంద్రయ్య జూలై 11వ తేదీన పల్లెకోన, నగరం, కనగాల గ్రామాల్లోని 135 మంది బీదలకు 34 63 ఎకరాల బంజరు భూమికి పట్టాలను యిచ్చారు. ఒలేరు, ఉప్పూడి, కనగాల, కొండాపాలెం గ్రామాల్లోని 75 మంది బీదలకు 2 3 ఎకరాల భూమిని నివేశన స్థలాలుగా పట్టాలు యిచ్చారు.

## గూడూరు మునిసిపల్ పాఠశాల భవనం ప్రారంభం

రూ 52 వేలతో నిర్మించిన శ్రీమతి చిల్లకూరు శేషమ్మ మునిసిపల్ ప్రాథమిక పాఠశాల భవనాన్ని రాష్ట్ర మైనర్ యిరిగేషన్ శాఖ మంత్రి శ్రీ ఆనం వెంకటరెడ్డి ప్రారంభించారు. దీని కయ్యే వ్యయంకోసం డాక్టర్ సి ఆర్. రెడ్డి తన కుటుంబం తరఫున రూ. 25 వేలు విరాళం యిచ్చారు. భవన నిర్మాణానికి ఒక రాఫిల్ కూడా నిర్వహింపబడింది.

మంత్రి శ్రీ ఆనం వెంకటరెడ్డి పాఠశాల భవనం ప్రారంభించిన అనంతరం ప్రసంగిస్తూ విరివిగా విరాళాలు యిచ్చి యిటువంటి సంస్థలను పటిష్ఠంచేయాలని ప్రజలకు విజ్ఞప్తిచేశారు.

## గూడూరు ఆస్పత్రిలో "బ్లడ్ బ్యాంక్" ఏర్పాటు

గూడూరు ప్రభుత్వ ఆస్పత్రిలో జూలై 18వ తేదీన రాష్ట్ర ఆరోగ్యశాఖ మంత్రి శ్రీ కె. రాజమల్లు రూ. 13 వేలతో ఏర్పాటు చేసిన శ్రీ బి. వేమచంద్‌దుగార్ బ్లడ్ బ్యాంకును ప్రారంభించారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ శ్రీ రాజమల్లు బీదప్రజలకు వైద్య సదుపాయాలను కల్పించటానికి వైద్య సిబ్బంది కృషిచేయాలని కోరారు.

## అందరూ మహిళలే నిర్వాహకులుగావున్న సహకార అర్బన్ బ్యాంకు

అందరూ మహిళలే నిర్వాహకులుగావున్న దేశంలోని తొలి సహకార అర్బన్ బ్యాంకును గుంటూరు మునిసిపల్ కార్యాలయం ఆవరణలో జిల్లా కలెక్టరు శ్రీ కె. చంద్రయ్య జూలై 6న ప్రారంభించారు.

ఈ బ్యాంకులో అన్ని వర్గాలకుచెందిన మహిళలు మాత్రమే వాటాదార్లు, డైరెక్టర్లు, ఉద్యోగులు కావడం ప్రత్యేకత ఈ బ్యాంకు దేశమంతటికీ మార్గదర్శకంగా నిర్వహింపబడేట్లు చూడవలసినదిగా కలెక్టరు మహిళలకు విజ్ఞప్తిచేశారు. బ్యాంకు చీఫ్ ప్రమోటరు, అధ్యక్షురాలు అయిన శ్రీమతి కె విమలాచంద్రయ్య వాటా మూలధనం రూ. 2 లక్షలు త్వరలో సేకరించవలసిందిగా వాటాదార్లను కోరారు. అంతర్జాతీయ మహిళా సంవత్సరం సందర్భంగా యీ బ్యాంకు ప్రారంభించామని ఆమె అన్నారు. డిప్యూటీ సహకార రిజిస్ట్రార్ శ్రీ డి యస్. శాస్త్రి, నివేదిక సమర్పిస్తూ పట్టణంలో 116 మంది మహిళలు స్వచ్ఛందంగా రూ 5 వేలు ఈ బ్యాంకు ప్రారంభించడానికి మూలధనంగా సమకూర్చారన్నారు.

## ఆదిలాబాద్ టవున్ హాలుకు శంకుస్థాపన

జూలై 12వ తేదీన ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ఆదిలాబాద్‌లో "ఇందిరాగాంధీ టవున్ హాల్"కు శంకుస్థాపన చేశారు. రూ. 5 లక్షల వ్యయంతో నిర్మిస్తున్న యీ టవున్‌హాల్ నిర్మాణానికి జిల్లాలోని ప్రజలు తలకొక రూపాయివంతున విరాళంగా యిచ్చారు.

ఆదిలాబాద్ జిల్లాలోని సత్నాల ప్రాజెక్టు నిర్మాణాన్ని ఐదవ పంచవర్ష ప్రణాళికలో ప్రారంభిస్తున్నట్లు, ఆదిలాబాద్‌లో సిమెంటు ఫ్యాక్టరీ నిర్మాణం ప్రతిపాదనను కేంద్రప్రభుత్వం ప్రణాళికా సంఘంకూడా ఆమోదించినట్లు ముఖ్యమంత్రి ప్రకటించారు.

---

## వెలుగులోకి...

(23వ పుటనుండి)

ఒకప్పుడు నారాయుడికి భవిష్యత్తులోకి తొంగి చూడాలంటే బితుకు బితుకుగా వుండేది. ఇప్పుడు ప్రభుత్వం బలహీన వర్గాలవారి సంక్షేమానికి కృతనిశ్చయంతో బృహత్తర కార్యక్రమాల్ని ప్రారంభించడంతో రేపటిమీద కొండంత విశ్వాసం కుదురుకుంది. వందలాది సంవత్సరాలుగా పట్టించుకోకుండా వదిలేయబడ్డ బలహీన వర్గాలవారి అభ్యుదయానికి యిటీవలి కాలంలో ప్రత్యేక శ్రద్ధ, కృషి ప్రారంభం అయ్యాయని ఆయన అభిప్రాయపడ్తున్నాడు. వ్యక్తులు కూడా కృషిచేసి తమని తాము ఉద్ధరించుకోడానికి ప్రయత్నించినప్పుడే ప్రభుత్వ కృషి మంచి ఫలితాలను యిస్తుందని ఆయన అన్నాడు.

ప్రభుత్వం చేపట్టిన సంక్షేమ చర్యల వల్లా అభివృద్ధి కార్యక్రమాల వల్లా లాభించిన అనేకానేక కుటుంబాలలో నారాయుడి కుటుంబం ఒకటి. అటువంటి కుటుంబాలు ఆంధ్రప్రదేశ్‌లో అనేకం వున్నాయి చిన్న రైతుల అభివృద్ధి సంస్థ వంటి అభివృద్ధి ఏజెన్సీల సహాయంతో తమని తాము ఉద్ధరించుకోదలచినవారికి శ్రీ సింకా నారాయుడు చక్కని ఉదాహరణ. 

PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVT. OF ANDHRA PRADESH, AT THE GOVT. CENTRAL PRESS HYDERABAD
PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION, PUBLIC RELATIONS ANDHRA PRADESH HYDERABAD

Regd. No. H. 81

# ప్రజాభీష్టం నెరవేరాలి

దేశం వెలుపల నుంచిగానీ, లోపల నుంచి గానీ వచ్చే ప్రమాదాలను ఎదుర్కొని దేశ భద్రతను సంరక్షించడం ప్రధానమంత్రి ప్రథమ బాధ్యత.

ప్రభుత్వాన్ని స్తంభింప జేయడానికై, దేశ వ్యాప్త శాసనోల్లంఘనానికి కొన్ని పార్టీలు కలిసి పిలుపు యిచ్చాయి. సైన్యాన్నీ, పోలీసులనూ ఉత్తరువులను ధిక్కరించమని కూడా కోరారు, వారి ఆటలు సాగనిస్తే దేశంలో అస్థిరత్వాన్నీ, అరాజకత్వాన్నీ, అసమగ్రతనూ ఆహ్వానించి నట్లే. ఏ ప్రభుత్వమైనా దీనిని సాగనిస్తుందా ?

ప్రజాస్వామ్యంలో ప్రజల అభీష్టం నెరవేరాలి. వారికి యిష్టం వచ్చిన ప్రభుత్వాన్ని ఎన్నుకుంటారు. అంతే కాని ప్రతి పక్షాలు కోరగానే ఎన్నికైన ప్రభుత్వాలు దిగిపోవడం కాదు.

—శ్రీమతి ఇందిరా గాంధీ